## ధ్యానం

# క్రియ ప్రతిక్రియ




మానవ మనుగడ చిక్కగా నేసిన బట్ట. ఈ బట్ట పడుగు పేకలే వ్యక్తిగత జీవితాలు - దారపు పోగులు- వేటికవే ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా ప్రత్యేకంగానూ, విడివిడిగానూ ఉంటాయి. ప్రతీ నూలుపోగూ దాని స్థానంలో అది ఉంటూ. దాని మార్గంలో అది పోతూ నేసిన బట్టకు ఒక రూపాన్ని ఆపాదిస్తుంది మానవ జీవితంలో ప్రతీవ్యక్తి తను చేసుకున్న కర్మఫలాన్ని సుఖమో, దుఃఖమో అనుభవించి తీరతాడు. గత్యంతరం లేదు.

నీవు ఒక పని చేస్తే దాని ప్రతిఫలం నీవే అనుభవిస్తావు ఇంకొకరు అనుభవించటం లేదు ఎవరి బ్రతుకుకు వారే కర్తలు. నీ బ్రతుకుకు నీవే కర్తవు నీ ఆలోచనలకు నీవే కర్తవు. ఎవరి మార్గం వారిది ఎవరికి వారు తమ మంచిని ఎప్పటికప్పుడు

(మిగతా 29 వ పేజీలో)

## సంపాదకునిపేజీ

# నీ విమర్శకుడే నీకు నిలువుటద్దం

నీకు ఒక నిలువుటద్దం ఎంతో అవసరం. నీ నిజ స్వరూపాన్ని, నీ అంగ సౌష్ఠవాన్ని, నీ ముఖ సౌందర్యాన్ని, నీ గుణాన్ని, నీ నైజాన్ని, నీ తత్త్వాన్ని యథా తథంగా సమీక్షించి ప్రదర్శించగల మిత్రుడు కావాలి ఇతరులు నిన్ను చూచే విధంగా నీ అంతట నీవు చూచుకోవాలి. ఇతరులు నిన్ను ఏ విధంగా విలువ కడుతున్నారో ఆదే రీతిగా నిన్ను నీవు విలువ కట్టుకోవాలి. ఎంత అమూల్యమైన వజ్రమైనా సానపెడితేగానీ వాడి వెలుగు పుట్టవు సుమా. వ్యష్టి సమిష్టి భూత భవిష్యద్వర్తమానాలతో పెనవేసుకుపోయిన నీ మనుగడకు విమర్శ, పరామర్శలు చాలా అవసరం. ఇట్టి విమర్శవల్ల నీ గుణదోషాల ప్రభావం నీకు తెలుస్తుంది. నీ తత్త్వం నీకు తెలుస్తుంది. నిన్ను నీవు తెలుసుకో గలుగుతావు. నీ నిజస్వరూపం

## కస్తూర్బా మెడికల్ కాలేజీకి 6,000 మందికి పైగా రక్తదానం చేస్తారు

భారతదేశంలో కర్ణాటకకు చెందిన మణిపాల్‌లోని కస్తూర్బా మెడికల్ కాలేజీ ఒక్కచోటే రక్తాన్ని కొనకపోవచ్చు. ఇక్కడ మొత్తం 6,000 మంది రక్తదానానికి పేర్లను నమోదు చేసుకున్నారు.

"ఉన్నది ఉన్నట్లు చూడడం, చేసేది చెయ్యవలసిన విధంగా చెయ్యడం ఇదే ప్రపంచ జ్ఞానం."

నీకు తెలుస్తుంది. అదే వివేకం. సమాజంలో ఒకడవు నీవు. నీ చుట్టు నీ స్నేహితులు ఎంతమందో. అందరూ నిన్ను పొగిడేవాళ్ళే. వట్టిచేతులతో ఆదరిస్తారు. వారు చెప్పేది ఒకటి. చేసేది ఒకటి. చెప్పేదానికి చేసేదానికి పొందిక కనిపించదు. మాటలతో నీకు పట్టాభిషేకం చేసి సామ్రాజ్యాధిపతిని చేస్తారు. నిజమే అనుకుంటావు. పొంగి పోతావు. ఆనందపడిపోతావు. నీ నిజ స్వరూపం నీవు మరుగు చేసుకుంటావు. వారి మాటలు వట్టి నురుగులు, వట్టి పొగలు, బడాయికోరు మాటలు. నిజమే. దీనికి వారినే దూషించ నక్కరలేదు. పూర్తిగా లోపం



వారిది కాకపోవచ్చు. ఒక్కొక్కప్పుడు నీవు నిర్మాణాత్మకమైన విమర్శను సహించలేవు. నిన్ను దుమ్మెత్తి పోస్తూంటే నీవు ఊరు కుంటావా? నిజం చెబితే నీవు ఊరుకో గలవా? త్రాచుపాము లేచినట్టు లేస్తావు. కాబట్టి నీ స్నేహితులు నిన్ను గురించి ఏం నిర్ణయించుకున్నారో నిష్కపటంగా చెప్ప మని అడుగు. నీ స్నేహితులను అడిగి నీ యధార్థ స్వరూపం తెలుసుకోడం నీ బాధ్యత. ఇదే ఆత్మోన్నతికి మార్గం. మరుగెపోయి ఉన్న బింబాన్ని నిష్కలంకంగా ప్రకాశింప జేసుకో గలుగుతావు. బ్రతుకు తేజో మయంగా ఉంటుంది.

నీ ఆరోగ్యానికి నీ వైద్యుడు స్వచ్ఛమైన సమతల దర్పణం! నీ ఆరోగ్యాన్ని పొగిడి చెప్పడు. నీ నాడి గుణదోషాలను యధా తధంగా పరిశీలించి వివరిస్తాడు. ఎంతచేదైనా, ఎంత వెగటైనా వైద్యుడిచ్చిన మందు మోతాదువల్ల నీకు ఆరోగ్యం చేకూరుతుంది అని అనుకుంటావు నీవు రోగంతో బాధపడి పోతూంటే నీ ఆరోగ్యాన్ని ప్రశంసించే వైద్యుణ్ణి సహించగలవా?

మానవుడు ఏవేవో కలలు కంటూంటాడు. వీటిని - కవి సాహిత్యరంగంలో సాక్షాత్కా రింప జేసుకుంటాడు. శిల్పి శిల్పకళారంగంలో సాక్షాత్కారింప జేసుకుంటాడు, చిత్రకారుడు చిత్ర కళారంగంలో సాక్షాత్కారింప జేసు కుంటాడు. ప్రతీ ఒక్కరు వారి వారి రంగా లలో సాక్షాత్కారింప జేసుకుంటారు ఈ సాధనల గుణ దోషాల సాకల్య సమీక్షకు విమర్శకులు కావాలి. వాటి బాగోగులు విమర్శకులే చెప్పాలి. కవిత్వంలో ఉన్న కవితారస మాధుర్యం కవికి తెలియదు. ఆ కవిత్వాన్ని విమర్శించే వ్యాఖ్యాతకే తెలు స్తుంది దాని రసమాధుర్యం.

సద్విమర్శ అంటే గుణదోషాల సాకల్య సమీక్ష మాత్రమే. ఊరికే దుమ్మెత్తి పోయడం విమర్శ అనిపించుకోదు. ప్రశంసా స్థాయిని ప్రవృద్ధి పరచడానికే విమర్శనగాని కుష్కింప చేయడానికి కాదు. కవి తన కావ్యం ప్రజల సొమ్ము అనుకున్నప్పుడు, శిల్పి తన శిల్పం ప్రజల సొమ్ము అనుకున్న

(మిగతా 10 వ పేజీలో)

"జనన మరణాలతో కూడిన మర్త్యునికి భగవంతుని చరణారవింద సముపాసనమే అమృతప్రాయమైన సిద్ధౌషధం."

# వార్తా పత్రికల కథ

సుమారు 420 సంవత్సరాలకు పూర్వం ప్రపంచంలో అసలు వార్తాపత్రికలే లేవు. ఆధునిక రూపంలో ప్రపంచంలో మొట్టమొదటి వార్తాపత్రిక 1566 వ సం.లో ప్రారంభమైంది అని చెప్పుకోవాలి. అప్పుడు వెనిస్ (ఇటలీ) ప్రభుత్వంవారు చేతితో వ్రాసిన న్యూస్ షీట్లను విడుదలచేసి వీధులలో ప్రదర్శించేవారు. గెజెటా (Gazetta) అనే చిన్న నాణెం చెల్లించినవారు మాత్రమే



ఈ న్యూస్ షీట్లను చదువుకోడానికి అనుమతింపబడేవారు. అందుచేతే వీటిని గెజెట్స్ (Gazettes) అన్నారు. ఈ గెజెట్లకు చాలా ప్రసిద్ధి కలిగింది. కొంత కాలానికి వీటిని అచ్చువేయడం ప్రారంభించారు.

అన్ని విధాలా వార్తాపత్రిక వంటిది ఒకటి ప్రాచీన రోములో ఉండేది. దీన్ని ఆక్టాడయార్నా (Acta Diurna) లేక రోజువారీ కార్యకలాపాలు అనేవారు. వీటిలో రోమన్ సామ్రాజ్యంలో ఇంపీరియల్ ఆర్మీ సైన్యాధికారులకు సమర్పించిన యుద్ధ వివరాలు ఉండేవి. సైన్యాధికారులు వీటిని వారి పై అధికార్లకు ప్రసారం చేసేవారు.

దీన్నిబట్టి చూస్తే పశ్చిమ ఆసియా అస్సిరియాలోను, బాబిలోన్‌లోను రాతి పలకల మీద చెక్కబడినవే అతి ప్రాచీనమైన వార్తా పత్రికలు అని చెప్పుకోవాలి. వీటిలో ఉన్న విషయాలు మిక్కిలి ప్రాచీనమైనవి. సైలోమ్ శాసనం (Siloam inscription) 1880 వ సం.లో జెరూసలమ్‌కు ఈశాన్య దిక్కుగా రాతి డామ్‌లో లభించింది. దీంట్లో ఫోనీషియనులు (phoenicians), హీబ్రూలు, మోబైట్సుకు చెందిన లిపి ఉంది.

మొట్టమొదట ఇంగ్లీషు వార్తాపత్రిక వీక్లీన్యూస్ (Weekly News) 1622 వ సం లో లండన్ నగరంలో ప్రచురింపబడింది. ఎప్పుడో చాలా కాలం క్రిందటే ఇది నిలిచిపోయినా ఆ కాలానికి సంబంధించిన స్వీడిష్ అఫిషియల్ జర్నల్ 'పోస్ట్ ఓక్ ఇన్‌రైక్స్ టిడ్నింగార్ (Post Och Inrikes tidningar) 1645 వ సం.లో ప్రారంభింపబడింది. ఈ పత్రిక ఇప్పటికీ ప్రచురింపబడుతూంది.

భారతదేశంలో మొట్టమొదటి వార్తా పత్రిక 'బెంగాల్ గెజెట్' (Bengal

## యునైటెడ్ కింగ్‌డమ్ అంటే?

ఇంగ్లండు వేల్స్, స్కాట్లండ్, నార్తరన్ ఐర్లాండ్ చేరిన బ్రిటన్‌నే యునైటెడ్ కింగ్‌డమ్ (UK) అంటారు.

“అగర్భ శ్రీమంతుల బిడ్డలకు డబ్బుయొక్క మహత్వము తెలిసియుండదు.”

# వార్తా పత్రికల కథ

సుమారు 420 సంవత్సరాలకు పూర్వం ప్రపంచంలో అసలు వార్తాపత్రికలే లేవు. ఆధునిక రూపంలో ప్రపంచంలో మొట్టమొదటి వార్తాపత్రిక 1566 వ సం.లో ప్రారంభమైంది అని చెప్పుకోవాలి. అప్పుడు వెనిస్ (ఇటలీ) ప్రభుత్వంవారు చేతితో వ్రాసిన న్యూస్ షీట్లను విడుదలచేసి వీధులలో ప్రదర్శించేవారు. గెజెటా (Gazetta) అనే చిన్న నాణెం చెల్లించినవారు మాత్రమే



ఈ న్యూస్ షీట్లను చదువుకోడానికి అనుమతింపబడేవారు. అందుచేతే వీటిని గెజెట్స్ (Gazettes) అన్నారు. ఈ గెజెట్లకు చాలా ప్రసిద్ధి కలిగింది. కొంత కాలానికి వీటిని అచ్చువేయడం ప్రారంభించారు.

అన్ని విధాలా వార్తాపత్రిక వంటిది ఒకటి ప్రాచీన రోములో ఉండేది. దీన్ని ఆక్టాడయూర్నా (Acta Diurna) లేక రోజువారీ కార్యకలాపాలు అనేవారు. వీటిలో రోమన్ సామ్రాజ్యంలో ఇంపీరియల్ ఆర్మీ సైన్యాధికారులకు సమర్పించిన యుద్ధ వివరాలు ఉండేవి. సైన్యాధికారులు వీటిని వారి పై అధికార్లకు ప్రసారం చేసేవారు.

దీన్నిబట్టి చూస్తే పశ్చిమ ఆసియా అస్సీరియాను, బాబిలోన్‌లోను రాతి పలకల మీద చెక్కబడినవే అతి ప్రాచీనమైన వార్తా పత్రికలు అని చెప్పుకోవాలి. వీటిలో ఉన్న విషయాలు మిక్కిలి ప్రాచీనమైనవి. సైలోమ్ శాసనం (Siloam inscription) 1880 వ సం.లో జెరూసలమ్‌కు ఈశాన్య దిక్కుగా రాతి డామ్‌లో లభించింది. దీంట్లో ఫోనీషియనులు (phoenicians), హీబ్రూలు, మోబైట్సుకు చెందిన లిపి ఉంది.

మొట్టమొదట ఇంగ్లీషు వార్తాపత్రిక వీక్లీ న్యూస్ (Weekly News) 1622 వ సం.లో లండన్ నగరంలో ప్రచురింపబడింది. ఎప్పుడో చాలా కాలం క్రిందటే ఇది నిలిచిపోయినా ఆ కాలానికి సంబంధించిన స్వీడిష్ అఫిషియల్ జర్నల్ 'పోస్ట్ ఓక్ ఇన్‌రైక్స్ టిడ్‌నింగార్ (Post Och Inrikes tidningar) 1645 వ సం.లో ప్రారంభింపబడింది. ఈ పత్రిక ఇప్పటికీ ప్రచురింపబడుతూంది.

భారతదేశంలో మొట్టమొదటి వార్తా పత్రిక 'బెంగాల్ గెజెట్' (Bengal

## యునైటెడ్ కింగ్‌డమ్ అంటే?

ఇంగ్లండు వేల్స్, స్కాట్లండ్, నార్తరన్ ఐర్లాండ్ చేరిన బ్రిటన్‌నే యునైటెడ్ కింగ్‌డమ్ (UK) అంటారు.

“అగర్భ శ్రీమంతుల బిడ్డలకు ధనముయొక్క మహత్వము తెలిసియుండదు.”

# ౩౦ మీటర్ల డైనోసరస్

అంతరించిపోయిన జంతువులను గురించి పరిశోధనలు చేసే లుప్త జంతుశాస్త్రజ్ఞులు (Palaeontologists) చాలా కాలం క్రిందటే అంతరించిపోయిన డైనోసరస్ అవశేషాలను సోవియెట్ రిపబ్లిక్ టుర్క్మేనియాలో కనుగొన్నారు. అనేక కోట్ల సంవత్సరాలకు పూర్వం డైనోసరస్ భూమి మీద నివసిస్తూ మానవుడు భూమిమీద పుట్టడానికి ముందే అంతరించిపోయింది.



డైనోసరస్

బ్రహ్మాండమైన డైనోసరస్లు 30 మీటర్ల పొడవు 12 మీటర్ల ఎత్తు ఉంటాయి! ఒక 4 అంతస్తుల భవనం అంత! చుంచుకంటే చిన్న డైనోసరస్లు కూడా ఉండేవి!

చాలాకాలం క్రిందట అంతరించిపోయిన ఈ జంతువులను గురించి అధ్యయనం, పరిశోధన సులభసాధ్యంకాదు. ఇంతవరకు ఈ పరిశోధకులు వాటికి చెందిన అవశేషాలను, ఎముకలను సంగ్రహించగలిగారు. పెద్ద పెద్ద కొండల మీద, రాతిబండల మీద వాటి రూపాలముద్రలను చూడగలిగారు. అవి సంచరించిన ప్రదేశాలను గుర్తించగలిగారు. లభించిన ఎముకలను చేర్చి డైనోసరస్ ఎముకలగూడు ఎలా ఉంటుందో, వాటి రూపం ఎలా ఉంటుందో ఊహించగలిగారు.

ప్రకృతిలో అసలు ఆచూకీ లేకుండా ఏదీ అదృశ్యమైపోదు. డైనోసరస్లు అతి ప్రాచీనమైన జంతువులు. కాలక్రమేణా పరిణామావస్థలో క్రొత్త జంతువులు పుట్టాయి ప్రాచీన జంతువుల రూపాలను, గుణాలను సంతరించుకున్నాయి. ఇటీవల ఈ శాస్త్రజ్ఞులు ఆస్ట్రిచ్ (నిప్పుకోడి), బస్టర్డ్ పక్షుల రూపురేఖలు, శరీర నిర్మాణం అంతరించి పోయిన డైనోసరస్ను పోలి ఉన్నాయని కనుగొన్నారు. అంతే గాకుండా డైనోసరస్ ఎముకలకు ఈకలు కూడా ఉన్నట్టు కనుగొన్నారు.

నేటివరకూ కూడా ఈ డైనోసరస్ జంతువులు అంతరించి పోవడానికి కారణాలను గురించి ఈ శాస్త్రజ్ఞులకు ఏకాభిప్రాయం లేదు. సముద్రాలలో ప్రయాణాలు చేసే నావికులు అక్కడక్కడ నిర్మానుష్యమైన దీవులలో వింత వింత జంతువులున్నాయని చెబుతున్నారు.

('మిషా' సౌజన్యంతో)

# తుఫానులవల్ల తూర్పు తీరానికి ఎక్కువ నష్టం

ప్రపంచంలో ఏ ఇతర ప్రదేశంలోకంటే భారతదేశంలో తూర్పుతీరం తుఫానుల వల్ల ఎక్కువగా (1900 సం॥ నుంచి 55) నష్టాన్ని పొందింది.

"లోకమున ఎయ్యది శ్రేష్ఠవస్తువో అది సులభముగా దొరకదు."

# ప్రపంచవార్తలు

## వర్ధమాన దేశాలలో మహిళలు పోషకాహార లోపంవల్ల బాధపడుతున్నారు:

ప్రపంచ ఆరోగ్య సంస్థ (WHO) వారి ఇటీవలి సమాచారం ప్రకారం వర్ధమాన దేశాలలో 230 మిలియను మహిళలు సరైన పోషకాహారం లేక రకరకాల రోగాలతో ముఖ్యంగా పౌష్టికాహార లోపం వల్ల కలిగే రక్తక్షీణతవల్ల బాధపడుతున్నారని తెలుస్తూంది. ఆహారలోపంవల్ల సంభవించే 'అవిటమినాసిస్' (Avitaminasis) వల్ల పిల్లల ఆరోగ్యం చెడిపోతుంది. పోషకాహార లోపంవల్ల కలిగే రక్తక్షీణతవల్ల మలేరియా మరియు ఇతర ఉదర రోగాలు ఎన్నో సంభవిస్తాయి.

* * *

## మానవ హృదయంలో నిరాటంకంగా రోగలక్షణాలను తెలుసుకునే సాధనం:

సోవియెట్ యూనియన్‌లో వైద్య నిపుణులు క్రొత్తగా మానవహృదయంలో దీర్ఘకాలంపాటు నిరాటంకంగా రోగలక్షణాలను తెలుసుకోగల లెంటా ఎమ్‌జి (Lenta MG) అనే అపూర్వ సాధనాన్ని రూపొందించారు. ఇది 700 గ్రాములు భారం ఉంటుంది. రోగి మామూలుగా పనులు చేసుకుంటూన్నా దీనిని తగిలించుకుంటే 30 గంటల పాటు ఎలక్ట్రిక్ కార్డియో గ్రామ్‌ను చిత్రిస్తుంది. ఒక క్రొత్త ప్రత్యేక మైక్రో కంప్యూటర్ వివరాలను క్రమపరుస్తుంది. ఈ క్రొత్త సాధనంవల్ల హృదయ సంబంధమైన రోగాలు అతిశీఘ్రంగా తెలుస్తాయి. ఇది అకస్మాత్తుగా మరణాన్ని కలిగించే నిర్ధారణ చేయబడని సంకీర్ణరోగాల చికిత్సకు కూడా సహాయపడుతుంది.

* * *

## పురావస్తు పరిశోధకులు కనుగొన్న ప్రాచీన పాలరాతి విగ్రహం:

గ్రీస్ దేశం ఏథెన్స్‌లో పర్వత ప్రదేశంలో పురావస్తు పరిశోధకులు జోలాడుతూన్న ఉడుపులతో నిండు పరిమాణంలో ఉన్న పాలరాతి విగ్రహాన్ని త్రవ్వి తీసారు. తల కాళ్ళు లేని ఈ పాలరాతి విగ్రహం హెలెన్ కాలానికో లేక గ్రీసును ఆక్రమించిన రోమనుల కాలానికో చెంది ఉండాలని ఊహిస్తున్నారు.

* * *

## 15 మైళ్ళ విస్తృత వైశాల్యంలో పేల్చగల అమెరికా దేశపు 'బ్రెయిన్' తుపాకి:

అమెరికా దేశపు క్రొత్త బ్రెయిన్ తుపాకికి అమర్చిన రాడారు గంటకి 900 మైళ్ళ వేగంతో వెళ్ళే విమాన మార్గాన్ని అనుసరిస్తుంది. 15 మైళ్ళ విస్తృత వైశాల్యం వరకు దీని ప్రభావం ఉంటుంది. పగలు రాత్రి కూడా పనిచేసే ఈ సాధనకి వేరే సిబ్బందీ ఒక్కర లేకుండా నిమిషానికి 45 గుళ్ళను పేలుస్తుంది.

---

"చక్కని పదములను మృదుమధురంగా చెప్పగల నేర్పుగలవాడే కవి."

# ఔషధ ప్రపంచం

## కాలిఫోర్నియా వైద్యులు అభివృద్ధిపరచిన 'లాసెరోస్కోప్'



కాలిఫోర్నియాలో వైద్యశాస్త్ర నిపుణుడు డా. గార్రెట్ లీ మూడు భాగాల కెథీటర్ గొట్టం చివర లేసర్ కిరణాలను ఉత్పత్తి చేసాడు. ఇవి రక్తనాళాలలో పేరుకుపోయిన క్రొవ్వును దహించేస్తుంది లేకపోతే ఆవిరిగా మారుస్తుంది. ఇది 3 మి. మీల కంటే సూక్ష్మంగా ఉంటుంది. దీని సహాయంతో వైద్యులకు లేసర్ కిరణాలను క్రమపరచి సూటిగా ధమనులలో అధికంగా చేరిన క్రొవ్వు మీదికి ప్రసరింపజేయడానికి వీలు కలుగుతుంది. హృదయం చుట్టూ ఉండే సున్నితమైన రక్తనాళాలమీద, తలలో ఉండే సున్నితమైన రక్తనాళాల మీద క్రొవ్వు పేరుకుపోయిన ప్రదేశాలమీదికి వైద్యులు ఈ కిరణాలను సౌలభ్యంగా ప్రసరింపజేయగలుగుతారు.

## న్యూరాల్జియా చికిత్సకు థెర్మోట్రాన్:

సోవియెట్ యూనియన్‌లో అజెర్ బెయ్‌జాన్ రిపబ్లిక్‌కి చెందిన టోఫిక్ ఇమోమాలెవ్ (Toflk Imomaliv) 'థెర్మోట్రాన్' అనే పరికరాన్ని అభివృద్ధి పరిచాడు. శిరస్సు సంబంధమైన నరాల రోగాలకు, తలనొప్పులకు, హ్రస్వదృష్టికి, పిల్లలలో మెల్లకంటికి సంబంధమైన చికిత్సలకు ఇది చాలా ఉపయోగపడుతుంది.

* * *

## పెరుగుదలను నియంత్రించే హార్మోను:

ఇప్పుడు సోవియెట్ యూనియన్‌లో శాస్త్రజ్ఞులు మానవుల పెరుగుదలను నియంత్రించే హార్మోను (Soma totropine) సొమాటోట్రోపైన్ మీద పరిశోధన చేస్తున్నారు. దీనివల్ల పొట్టివాళ్ళు సంవత్సరానికి 5 మొదలు 12 సెంటిమీటర్లు పెరగడానికి అవకాశం కలుగుతుంది. ఇది శరీరంలో అల్బ్యుమిన్, క్రొవ్వు, కార్బోహైడ్రేటుల వినిమయం, రోగనిరోధక శక్తిని కూడా నియంత్రిస్తుంది.

"మనస్సుకి శాంతి కలిగినప్పుడు నిజమైన గేయం మనలో మనమే వింటాం."

# గృహ వైద్యం

## మిరియాలు

ఉల్లి చేసేమేలు తల్లి చేయదన్నారు. నిజమే కాని ఉల్లికంటే కూడా ఆరోగ్యానికి మిక్కిలి ఉపయోగకరంగా ఉండి అనేక రోగాలకు సిద్ధ ఔషధంగా పనిచేసేది మామూలుగా ప్రతీ ఇంట్లోను పోపుల పెట్టెలో ఉండే మిరియం.

మిరియాలు రెండు రకాలు. సాధారణంగా వాడుకునే మిరియాలు పొట్టుతో ఉన్నమిరియాలు, నల్లమిరియాలు. నల్ల మిరియాలు నానబెట్టి పై పొట్టుతీసి ఆరబెట్టినవి తెల్లమిరియాలు. ఔషధంగా రెండు రకాల మిరియాలు గుణం ఒకటే అయినా తెల్ల మిరియాలు కొంచెం సౌమ్యంగా పనిచేస్తాయి. కొంచెం ఘాటు తక్కువ.

మిరియాల చూర్ణంతో తీసిన కషాయం కారంగా, వెగటుగా, ఘాటుగా ఉంటుంది. గొంతు నొప్పులకు, జలుబులకు, దగ్గులకు, శ్లేష్మ జ్వరాలకు, వాత జ్వరాలకు. అజీర్ణ రోగాలకు, క్రిమి సంబంధమైన రోగాలకు, మూలవ్యాధికి. కీళ్ళనొప్పులకు, నరాల రోగాలకు చేతికి అనువుగా సులభంగా చౌకగా దొరికే దివ్య ఔషదం మిరియం. ధాతు వృద్ధికి అమోఘమైనది జ్ఞాపకశక్తిని అధిక పరుస్తుంది.

పసిపిల్లలకు: మిరియాలకు సున్నం రాసి నీడలో ఆరబెట్టి ఆరిన తరువాత కొద్దిగా వేయించి మిక్సీలో పొడిచేసి పెట్టుకుని, పసిపిల్లలకు చిటికెడు పొడివేసి వేడినీళ్ళలో కలిపి త్రాగిస్తే దగ్గు, రొంప, విరేచనాలు మొదలైనవి తగ్గుతాయి.

తల నొప్పులకు: మిరియాలు నీళ్ళలో నూరి ఆ ముద్దను కణతలకు పటువేసే తల నొప్పులు తగ్గిపోతాయి.

జలుబులకు: రాత్రి పడుకునేముందు వేడి వేడి పాలలో మిరియాలపొడి, కొంచెం పసుపుపొడి వేసుకుని త్రాగితే ఎటువంటి జలుబులైనా ఇట్టే తగ్గిపోతాయి.

అజీర్తికి: నేతిలో మిరియాల పొడి వేయించి కొంచెం ఉప్పుచేర్చి మొదటి అన్నంలో తింటే మంచి జీర్ణకారి. అజీర్తి, విరేచనాలు తగ్గుతాయి. తినడానికి రుచిగా ఉంటుంది.

## జాతీయ మృగం



భారతదేశపు వన్యమృగాలలో అంతరించిపోతున్న పులిని రక్షించడానికి 1972 లో చేపట్టిన ఉద్యమ కార్యక్రమంలో ప్రభుత్వం 'పులి'ని జాతీయ మృగంగా ప్రకటించటం ముఖ్యాంశం.

"మూఢాచారాలు - అజ్ఞాత భయాలు మానవుడు తనకుతాను తగిలించుకున్న సంకెలలు."

బొంగురు గొంతుకకు: మిరియాల చూర్ణం తేనెతో కలిపి మూడు పూటలు తీసుకుంటే దగ్గు తగ్గి బొంగురు గొంతుక పోయి, కంఠస్వరం బాగుపడుతుంది.

దగ్గులకు: తులంఎత్తు పాత బెల్లంలో కొద్దిగా నీళ్ళుపోసి ముదరపాకం పట్టి అందులో మిరియాల చూర్ణం కలిపి చిన్న చిన్న గోళీలంత ఉండలుచేసి ఆ ఉండలు నోటిలో ఉంచుకుని రసం మ్రింగుతుంటే దగ్గులు తగ్గుతాయి. గ్రహణీ, రక్తగ్రహణి నివృత్తి చేస్తుంది.

జ్వరాలకు: ఆవు మజ్జిగలో మిరియాలు రాత్రిపూట నానబెట్టి నూరి రస సింధూరం కలిపి తయారుచేసిన మాత్రలు అనేక జ్వరాలకు వాడతారు. వీటిని వైద్యులు తయారు చేస్తారు.

ధాతుపుష్టికి, జ్ఞాపకశక్తికి: ప్రతి రోజూ రాత్రిపూట 2 చెంచాల పటిక బెల్లం పొడి, రెండు చిటికెల మిరియాల పొడి ఒక కప్పు వెచ్చని పాలలో త్రాగితే ధాతువృద్ధి కలుగుతుంది. జ్ఞాపకశక్తి అధికమవుతుంది.

కామెర్లకు: పాతిక మిరియాలు గుంటగలగర ఆకుతో మెత్తగానూరి చిన్న చిన్న మిరియాలంత మాత్రలు చేసి నీడన ఆరబెట్టి పూటకు రెండేసి మాత్రలు ఆవు మజ్జిగతో ఇస్తే కామెర్లు తగ్గిపోతాయి.

మిరియాల చారు: మిరియాలు, జీలకర్ర కొద్దిగా ధనియాలు చితకగొట్టి తయారు చేసిన చింతపండు చారు చాలా రుచిగా ఉంటుంది. జఠరదీప్తిని కలిగిస్తుంది. త్రిదోషాలను శమింపజేస్తుంది. సుఖ విరేచనకారి.

మసాలా టీ: టీ డికాక్షనుకు మరగ బెట్టే నీటిలో 5 లేక 6 మిరియాల పొడి, చితకగొట్టిన చిన్న అల్లంముక్క వేసి తయారుచేసిన టీ చాలా రుచిగాఉంటుంది

( 3 వ పేజీ తరువాయి)

ప్పుడు, చిత్రకారుడు తన చిత్రం ప్రజల సొమ్ము అనుకున్నప్పుడు, విమర్శకుడు తన విధి సంఘసేవ అనుకున్నప్పుడు సద్విమర్శన సాధ్యం. సద్విమర్శ మానవ వికాసానికి దోహదకారి.

ఋణాత్మకమైన విమర్శకులకు ప్రతి విషయంలోను దోషాలే కనిపిస్తాయి. వీరి విమర్శ అతి తీవ్రంగాను, ప్రమాదకరంగాను ఉంటుంది. తాము అనుభవించలేనిని ఇంకొకరు కూడా అనుభవించకూడదనేదే వీరి వాదం. హ్రస్వదృష్టితో చూసే స్వాభిమానులు గడ్డి తొట్టెలో కుక్కవంటి వారు.

విమర్శకుడు వెనుక చూపు కలిగిన సమకాలిక సంప్రదాయవాది అయితే అభినివేశంతో ప్రశంసిస్తాడు. ముందుచూపు వాడైతే తీవ్రంగా అభిశంసిస్తాడు. ఒకరు నిష్కాపట్యంగా న్యాయ సమ్మతంగా నిన్ను విమర్శించారంటే సరసంగా గ్రహించు. దోషంలేదు. సృష్టికి విమర్శ పునస్సృష్టి. నీ విజయానికి నీ స్నేహితులకు ఋణపడి ఉంటే నీ విమర్శకులకు అంతకంటే అధికంగా ఋణపడి ఉండు వట్టి శబ్ద జాలంలో నీవు ఆత్మోన్నతిని పొందాలని అనుకోకు. ఆత్మవంచకుడవు అయిపోతావు. ఆత్మ స్వరూపముతో ప్రకాశిస్తూంటే నీవు ధీరుడవే.

"దేవుని చింతించు దినము దినము,
చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు."

# బాధ్యతతో కూడిన స్వేచ్ఛ

ఒక వ్యక్తి పూర్తిగా సంతృప్తి చెంది నిర్విచారంగా సుఖసంతోషాలతో ఆనందం పొందాలంటే ఏ బాదరబందీలు లేకుండా స్వేచ్ఛను అనుభవించడం కాదు. పూర్తి బాధ్యతలతో కూడిన స్వేచ్ఛే నిజమైన స్వాతంత్ర్యం. దాంట్లోనే నీవు ఆశించిన ఆనందాన్ని అనుభవింగలవు. జన్మ చరితార్థం చేసుకుని తద్వారా పొందే సమగ్ర జీవితానుభవంలోనే ఉంది దీని రహస్యం.



1. పొదుపు చేసుకో: అవకాశం ఉన్నప్పుడే డబ్బు కూడబెట్టుకుని ఆదా చేసుకోవాలి. వృద్ధాప్యంలో నీ భద్రత కోసమే కాదు. నీ స్వాతంత్ర్యం నీ హక్కు. నీ భావి స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవాలంటే ఇప్పటి నుంచీ కూడబెట్టుకోడం అభ్యాసం చేసుకోవలసిందే.

2. విద్యార్హతలను పెంచుకో: విజ్ఞానం సంపాదించుకోవాలంటే విద్యాభ్యాసానికి అంతం ఎక్కడ? విద్యార్హతలను పెంచుకుంటూ నైపుణ్యాన్ని వృద్ధి చేసుకున్నకొద్దీ ఉద్యోగావకాశాలు అధికంగా లభిస్తాయి. కాబట్టి విద్యానైపుణ్యాభివృద్ధి వల్ల వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని అనుభవించగలుగుతావు. జీవనోపాధికి అధికంగా అవకాశాలు కలిగించే విద్యానైపుణ్యాలను అధికం చేసుకుంటున్నకొద్దీ వ్యక్తిగత స్వాతంత్ర్యం అధికమవుతుంది. నేటి ప్రపంచ పరిస్థితులలో ఎప్పటికప్పుడు మారుతూన్న విజ్ఞానాభివృద్ధితో సరిసమంగా నీ పరిధిలో నీ అభివృద్ధిని విస్తరింపజేసుకో.

3. ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకో: వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవాలంటే ముందు నీ శీలాన్ని రక్షించుకుంటూ కుసంస్కారాలను నిర్మూలం చేసుకో. రాగద్వేషాలను అరికట్టుకో. నీ లోపాలు తెలుసుకో. ఇదే వ్యక్తిగత స్వాతంత్ర్యానికి

## 7వ తరగతి విద్యార్థినికి ప్రపంచపు 'గ్రాండ్ప్రైజ్'

సియోల్‌లో 10వ ఆసియా క్రీడోత్సవ సందర్భంలో నిర్వహింపబడిన ప్రపంచ పాఠశాల విద్యార్థుల చిత్రకళా ప్రదర్శనంలో ఆంధ్రప్రదేశ్ గుంటూరు కేంద్రీయ విద్యాలయానికి చెందిన 7వ తరగతి విద్యార్థిని కుమారి పి. కల్యాణి చిత్రించిన 'వాలీబాల్' చిత్రానికి 'గ్రాండ్ ప్రైజ్' లభించింది. ప్రతిష్ఠాపూర్వకమైన ఈ ప్రైజ్ లభించిన ఆరు దేశాలలో భారతదేశం ఒకటి.

"చక్రిచింతనలేని జన్మంబు జన్మమే తరళసలిలబుద్బుదంబు గాక!"

ఆయువుపట్టు వంటిది. సత్యసంధుడు సత్యాన్ని జవదాటలేడు. మోహంలో పడిపోయి అనుమానాలు పెంచుకుంటే, బుద్ధి తక్కువ పనులు చేస్తూంటే ప్రగతిపథంలో పయనించలేవు.

4. ఇంటిగుట్టు బయటపెట్టకు: నీ రహస్య ప్రవృత్తిని నిగూఢంగా ఉంచుకో. వ్యక్తిగత స్వాతంత్ర్య సాధనకి ఉండవలసినంత రహస్యం ఉండితీరాలి. దీనికి ఏకాంతం



అవసరం. వ్యక్తిగత స్వాతంత్ర్యం నశించిపోతే ఏకాంతభావన శూన్యం అయిపోతుంది. రెండూ ఒకదానిమీద ఒకటి ఆధారపడి ఉన్నాయి. నువ్వు నువ్వుగా రాణించాలంటే నీ ఏకాంత జీవనంతో పాటు సమరసమైన సామాజిక జీవనం ప్రవృద్ధి చేసుకో.

నీ అంతరాత్మను వికసింపజేసుకుంటూ నీ సామర్థ్యాన్ని నీవు వెలకట్టుకోవాలంటే ఏకాంతంలోనే సాధ్యం. నీ ఆశయాలను నీవు గ్రహించుకోడానికి, నీ స్వప్నాలను నీవు సఫలం చేసుకోవాలంటే ఏకాంతం ఉండాలి. ఏకాంతంలో నీ ఆత్మజ్యోతిని తేజోవంతం చేసుకో.

5. సమర్పణ భావం పెంచుకో: త్రికరణశుద్ధిగా అర్పించుకుంటేనే తప్ప నీవు ఏ సంస్థకి అంకితమైపోకు. ఈనాడు ఎంతో మంది ఏ కట్టుబాట్లూ లేకుండా అనేక సంస్థలలో ఎన్నెన్నో పనులు చేస్తున్నారు. వీరి మీద పై అధికారుల పెత్తనాలు తీవ్రరూపం ధరిస్తాయి. వ్యక్తిగత స్వాతంత్ర్యం నశించిపోతుంది. నీ జీవితం నీ ఆశయాల మీదే ఆధారపడి ఉంటుంది. నీ ఆశయాలను నీవు సిద్ధించుకోడంలోనే ఉంది జీవితంలో అమూల్యమైన స్వాతంత్ర్యం. నీవు ఏ పని చేసినా దానిలో నీ స్వాతంత్ర్యాభివృద్ధి, సామర్థ్యాల విలువలను తెలుసుకో. మనఃపూర్వకంగా విశ్వసించి వాటినే క్రియారూపంలో పెట్టు.

6. పలుకుబడిని పెంచుకో: ఎప్పటికప్పుడు నీ పరిస్థితులను తెలుసుకుంటూ, ఫలితాలను అంచనా వేసుకుంటూ బాధ్యతాయుత నిర్ణయాలను తీసుకుంటూంటే నీవు పెద్ద నాయకుడవు అయిపోతావు. చుట్టూ పలుకుబడిని ఎలా పెంచుకుంటావు? నీ సంస్థలతో బాటు ఇతర సంస్థలను సరిపోల్చుకుంటూ, వివరాలను విమర్శించుకుంటూ, వివేకవంతమైన నిర్ణయాన్ని నిర్ధారణ చేసుకుంటూ ఉండు. అందరూ నీ అభిప్రాయాలను, నీ సలహాలను అభిలషిస్తారు. ఇతరులు నిన్ను మెచ్చుకున్నప్పుడు నీ భావనాశక్తి చైతన్యవంతమవుతుంది. పరిసర విషయ పరిజ్ఞానం

"మాయ - సదసద్విలక్షణమైన ఒకానొక పరబ్రహ్మశక్తి."

అధికంగా గల వ్యక్తి అందరి విశ్వాసాన్ని చూరకొనగలడు.

7. వ్యక్తిగత బాధ్యతను అభివృద్ధి చేసుకో నీ వ్యక్తిత్వాన్ని నిర్మించే శక్తులను, సామర్థ్యాలను తెలుసుకో. అదే వ్యక్తిగత స్వాతంత్ర్యానికి రాజమార్గం. ఉత్సాహాన్ని నీరసింప జేసుకోకుండా ఎప్పుడూ చురుకుగా ఉండు. నీవు విశ్వసించిన వాటిని సాధించడానికి బాధ్యత వహించు. కార్యసాధనకు ఉద్యమించు. లేకపోతే నీ అదృష్టం మరొకరి చేతిలోకి జారిపోతుంది.

ప్రఖ్యాత గ్రీకు చరిత్రకారుడు ఎడిత్ హామిల్టన్ ఏథెన్స్ పతనాన్ని గురించి వ్రాస్తూ—

"బాధ్యతలేని స్వాతంత్ర్యాన్ని పొందడానికి పోరాటం సలిపిన ఏథెన్స్ అమూల్యమైన స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకుంది. తిరిగి స్వాతంత్ర్యం సిద్ధించుకోలేక పోయింది" అన్నాడు.

ప్రత్యేక వ్యక్తులు స్వచ్ఛంద సంఘాలుగా ఏర్పడి అతి చాతుర్యంగా స్వాతంత్ర్యం సాధించుకో గలిగినా, పట్టుదలతో సంకల్ప శక్తిగల ప్రత్యేక వ్యక్తులు తమంతటతామే ఎంతో నైపుణ్యాన్ని ప్రదర్శింప గలుగుతున్నారు. 'అనేకమంది చేరి సాధించగల పనిని సాహసోపేతుడైన ధైర్యవంతుడొక్కడే చేయగలడు' అని థామస్ జెఫర్సన్ చెప్పాడు.

నీ సంకల్పాలకు, ఆచరణలకు ఆదర్శమైన పొందికతో నీ ప్రయత్నాలు సాగించు. నిశ్చయ జ్ఞానం పెంపొందించుకో. భయ వ్యామోహాలను బంధించుకోకు. నీ బుద్ధిని, నీ జీవితాన్ని పరాధీనం చేయకు. నీ నీడను చూసి నీవే బెదిరిపోకూడదు. నీ అనుభవాన్ని ప్రమాణంగా పెట్టుకుంటూ శుద్ధాంతఃకరణతో నీ స్వాతంత్ర్య కాంక్షను తీవ్రతరం చేసుకో. నీమీద నీ పెత్తనం ప్రవృద్ధి చేసుకుంటూ నిన్ను నీవు ఉద్ధరించుకుంటే లోకాన్నే ఉద్ధరించిన వాడవు అవుతావు. బాధ్యతతో కూడిన స్వేచ్ఛను అనుభవిస్తావు.

## శక్తిహీనులకు భగవంతుడే అభయం



మానవుడు నిస్పృహాయుడై తీవ్రమైన కష్టాలకు గురై నిరాధారుడై నిరాశ పడిపోయినప్పుడు సర్వోత్కృష్టుడైన పరమాత్మను స్మరిస్తే చాలు, ఏ ఆపదలు కలుగవు. శక్తిహీనులకు భగవంతుడే ఆశ్రయం.

—గురునానక్.

"ఆత్మతత్త్వము యొక్క ఎరుక మిథ్యాజ్ఞానమును పారద్రోలును."

# వీరిని గురించి తెలుసుకోండి

**అనిబిసెంట్:**

భారత స్వాతంత్ర్య ఉద్యమంలో ముఖ్య పాత్రను వహించిన ఆంగ్లేయ మహిళ. హోమ్ లీగ్ పరిపాలనను స్థాపించింది. భారత జాతీయ కాంగ్రెస్‌కు అధ్యక్ష పదవిని వహించింది.

* * *

**దత్తు ఫాడ్కర్:**



క్రికెట్ ఆటలో ఆల్‌రౌండరు, చతురుడు. 32 టెస్టులలో సగటున 32.34 చొప్పున 1,229 పరుగులు చేసాడు. సగటున 36.85 పరుగులతో 62 వికెట్లు తీసుకున్నాడు.

* * *

**హెచ్.డబ్ల్యు. లాంగ్ ఫెలో**

19 వ శతాబ్దంలో ప్రఖ్యాతి పొందిన అమెరికన్ కవి. హైపిరియన్ (Hyperion), వాయిసెస్ ఆఫ్ ది నైట్ (Voices of the Night), సాంగ్ ఆఫ్ హైవతా (Song of Haiwatha) ఇతడి సుప్రసిద్ధ రచనలు.

**ఎస్.కె. పొట్టెక్కాట్ (1931-82):**

సుప్రసిద్ధ మలయాళ కవి. సుమారు 50 గ్రంథాలు రచించాడు. ఇతడు రచించిన 'ఒక దేశస్థుని కథ' అనే నవలకు 1980 వ సం. రంలో జ్ఞానపీఠ్ అవార్డు లభించింది.

* * *

**మాక్స్ ప్లాంక్:**

జర్మన్ భౌతికశాస్త్ర విజ్ఞానవేత్త. ఇతడికి 1918 వ సం. లో భౌతికశాస్త్రానికి నోబెల్ బహుమతి లభించింది. ఇతడి క్వాంటం సిద్ధాంతం మార్పుటకు వీలులేని స్థిరమైన చరమసిద్ధాంతాల క్రోడీకరణ.

* * *

**స్వాతితిరునాళ్ మహారాజు (1813-1847):**

తిరువాంకూరును పాలించిన మహారాజు. సంస్కృతం, ఆంధ్రం, మలయాళం భాషలలోను సంగీతంలోను గొప్ప విద్వత్తుగల వాగ్గేయ కారకుడు. అనేకమంది కవులను, పండితులను, గాయకులను, శిల్పులను పోషించిన సంగీత సారస్వత కళాభిమాని. ఈతడికి కులశేఖర పెరుమాళ్ అనే పేరు కూడా వ్యవహారంలో ఉంది. ఇతడు తెలుగులో అనేక పదాలు, జావళీలు అతి సున్నితమైన శృంగారంతో సుకుమారంగా రచించాడు.

"ప్రకృతిపురుషునికై ప్రకృతిని అన్వేషించుట సహజము."

చాలా సహకరిస్తుంది. చర్మానికి పరిపోషణ కలిగించి నిగారింపును కలిగిస్తుంది. నిమ్మరసం పట్టిస్తే ముఖంమీద లేచే మొటిమలు, కాయలు పోతాయి.

చర్మ రోగాలకు ప్రతిరోజూ నిమ్మరసం మర్దన చేయాలి. నిమ్మరసంలో కొబ్బరి మానె, తులసి ఆకుల రసం కలిపిన మిశ్రమాన్ని పట్టిస్తే దురదలు, గజ్జి మొదలైనవి నివారింపబడతాయి.

అజీర్ణ రోగాలకు, మలబద్ధతకు ప్రతిరోజూ ఉదయం, రాత్రి వెచ్చని నీటిలో నిమ్మరసం కలిపి వారం రోజులు పుచ్చుకోవాలి. ఈ మిశ్రమం తీసుకున్న 3 గంటలకు ఆహారం కొంచెంగా పుచ్చుకోవాలి. జఠర కోశంలో ఆమ్లత్వాన్ని తగ్గిస్తుంది. జఠర కోశం చురుకుగా పనిచేస్తుంది.

కడుపు నొప్పులకు ఇతర పరిణామ శూలాలకు నిమ్మరసం శీఘ్రనివారణను కలిగిస్తుంది. ఉపవాసంచేసే సమయాలలో కూడా నిమ్మరసం తరచు తీసుకుంటుండాలి. ఆహారం తీసుకోకుండా వేడినీటిలో నిమ్మరసం కలిపి పుచ్చుకుంటే జలుబు వెంటనే నిమ్మళిస్తుంది.

పుష్టికరమైన నిమ్మరసంతో శరీర భారాన్ని తగ్గించుకోవచ్చు. నిమ్మరసంలో వేడినీరు, తేనె కలిపి తరచు తీసుకుంటే లావు తగ్గి సన్నబడతారు. దీంతోబాటు పళ్ళు, పచ్చికూరలు ఉపయోగించడం మంచిది. క్రొవ్వు పదార్థాలు అధికంగా లభించే అన్నము. పప్పు, బంగాళా దుంపలు, పాలు మొదలైనవి వాడకూడదు.

అనేక రకాల పుండ్లను మాన్పుటకు కూడా నిమ్మరసం ఉపయోగిస్తారు. ప్రాచీన చైనాలో నిమ్మకాయలు ఊరబెట్టిన ఉప్పు నీటిని పుండ్లకు పట్టించేవారు. వైజ్ఞానిక శాస్త్రప్రకారం శరీరంలో కొలోజెన్ ప్రవృద్ధికి ముఖ్యంగా విటమిను 'C' ఆవశ్యకమైనది.

## ఈ శతాబ్దంలో సాధించిన సాధనలు

### రాకపోకలు, ప్రయాణము, వాణిజ్యము



1903 ఫోర్డు ఉత్పత్తిని ప్రారంభించాడు.

1914 పనామా కాలువ ప్రారంభం.

1916 అన్ని వాతావరణాలలోను సముద్రంలో ఓడలకు ఎలక్ట్రానిక్ సేకనుల సౌకర్యం.

1965 కంటైనర్ పడవలకు పూర్తిగా ముందుగానే తయారైన ట్రక్ ట్రెయిన్ కంటైనర్ ప్రారంభమైంది.

1981 అంతకు ముందు జపాన్ బుల్లెట్ రైళ్ళ వేగాన్ని అధిగమించి గంటకు 235 మైళ్ళ వేగంతో ఫ్రాన్స్‌వారి ట్రెయిన్ గ్రాండె విటిస్సే ప్రపంచంలో వేగవంతమైన ట్రెయిను అని అనిపించుకుంది.

"మనిషికీ, మనిషికీ మధ్య ఉన్న అడ్డుగోడలు ఎంతో కృతకమైనవి."

# ఆత్మవంచన చేసుకోకు

నిత్యజీవితంలో ప్రతీ మానవుడు అడుగడుగునా ఎప్పటి కప్పుడు తనకు తాను న్యాయంగా ప్రవర్తించగలుగుతున్నానా? సత్యనిష్ఠను అనుసరించగలుగుతున్నానా? అని ప్రశ్నించుకోవాలి. సత్యనిష్ఠ జ్ఞానసాధకం. జ్ఞానసాధన లేని ధర్మం నిరర్థకం. ధర్మంలేని జ్ఞానం నిరర్థకం. దేముడు పైన ఆకాశంలో లేడు. ప్రతీ మానవ హృదయ కుహరం లోను కాంతివంతంగా విరాజిల్లుతుంటాడు. హాలలో కాదు, బొమ్మలలో కాదు ప్రతి విగ్రహములలో కాదు, పరబ్రహ్మ నీ ఆత్మలోనే ఉన్నాడు. ఎక్కడ జీవచైతన్యం ప్రతిస్పందిస్తూంటుందో అక్కడే శివం. శివమే ప్రతీ మానవ హృదయంలో నిబిడమై ఉన్నది.

జీవితంలో మానవుడు శివశక్తితో ప్రవర్తించగలిగినప్పుడు మూఢనమ్మకాలు, దురాచారాలు నశిస్తాయి. సమాజంలో ధర్మం పేరిట, మతం పేరిట ప్రబలి కరుడుకట్టుకు పోయిన సాంఘిక దురాచారాలను. వైషమ్యాలను నిర్మూలించుకుంటేగానీ వాస్తవమైన ధర్మమార్గ ప్రగతిలో ముందుకు పోతున్నామని చెప్పుకోలేం.

మనోమందిరంలో నిరామయమైన ప్రేమాభినివేశాలను పెంపొందించుకుంటూ సర్వసౌభ్రాతృత్వంతో విశ్వప్రేమతో మెలగడం నేర్చుకో. నీవు చేసే ప్రతి క్రియ నిష్కామ బుద్ధితో భగవదర్పణ భావంతో ఆచరించు. నిర్భయత్వం, నిర్మోహత్వం, నిరహంకారం, నిర్ద్వేషం వంటి పారమార్థిక గుణాలను శ్రద్ధతో, భక్తితో, క్షమతో, అభినివేశాలతో ప్రవృద్ధి చేసుకోడం తప్పనిసరి.

—డా. సర్వేపల్లి రాధాకృష్ణ.

## ఆమ్లవర్షాలు నాశనం చేస్తూన్న స్మృతి చిహ్నాలు



ఆమ్లవర్షాలు ఒక్క పారిశ్రామిక దేశాలలో మాత్రమే కనిపించేవి కాదు. ఇప్పుడు భారత దేశంలో కూడా ఇది ఒక ప్రత్యక్ష వాస్తవికత అవుతూంది. దీనివల్ల ఏర్పడే సల్ఫర్ డయాక్సైడు ఇతర రసాయనిక పదార్థాలు, పెద్ద పెద్ద నిర్మాణాలకు, స్మృతిచిహ్నాలకు నిర్మాణ వస్తువులకు హాని కలిగిస్తుంది. తాజ్ మహల్, ఎర్రకోట, కుతుబ్ మినార్, కోణార్క దేవాలయంమీద ఆమ్లాల ప్రతిక్షేప ప్రభావం కనిపిస్తూంది.

"సరిపెట్టుకొనుట నేర్చుకొనినయెడల మనంతట మనం అనేక మంచిగుణములను అలవరచుకొనవచ్చును."

# ప్రపంచంలో కొన్ని వింత గ్రంథాలు

రాఘవేంద్రరావు

ఎర్నెస్ట్ రైట్ రచించిన 'గాడ్స్బీ' అనే నవల పూర్తిగా కాల్పనిక నవల. ఆంగ్ల భాష అచ్చులలో ఐదవ అక్షరం 'E' ఉపయోగించకుండా 50,110 మాటలతో రచింపబడింది. దీనిని సమీక్షిస్తూ 'e' అక్షరం లేకుండా పది మాటలతో ఒక వాక్యం కూర్పగలిగిన నేర్పరికి ఈ నవలా రచయిత కష్టం తెలియగలదు అని లాస్ ఏంజెల్స్ టైమ్ పత్రిక సమీక్షించింది.



అపూర్వమైన 'E' వర్ణరహిత నవలను రచించడానికి ఎర్నెస్ట్ విన్సెంట్ రైట్‌కి 165 రోజులు పట్టింది. 1939వ సం.లో అమెరికాలో ప్రచురించబడినప్పుడు దీని వెల 3 డాలర్లు (రూ. 36). ఇప్పుడు పుస్తక వ్యాపారస్థులు ఒక ప్రతికి 1,000 డాలర్లు (రూ. 12,000) ధర చెబుతున్నారు.

అపురూపమైన గ్రంథాలలో అత్యంత అమూల్యము అరుదు అయినది - గుటెన్‌బర్గ్ బైబిల్. 1454వ సం.లో పశ్చిమ జర్మనీ మెయిన్జ్‌లో అచ్చు కాబడిన 21 ప్రతులలో ఒక ప్రతిని 1978వ సం.లో టెక్సాస్ యూనివర్శిటీవారు 24,00,000 డాలర్లు (రూ. 2.88 కోట్లు) వెచ్చించి కొన్నారు.

అతి ప్రాచీనమైన అచ్చు పుస్తకం కొరియాలో తయారైందని చాలా మందికి తెలియదు. కొయ్య పలకలమీద అక్షరాలు తలక్రిందు (రివర్సు)లో చెక్కి అచ్చువేయడం మొట్టమొదట బౌద్ధ దేవాలయాలలో ప్రారంభమైంది.

704 ఎ.డి.లో కొరియా కయోన్‌గ్జు (Kyongju) బౌద్ధ ధర్మాలు ఈవిధంగా అచ్చు కావింపబడ్డాయని నమ్మకంగా తెలుస్తుంది. అపురూపమైన పుస్తకాలకు అమూల్యమైన ధర గిట్టడం సహజమే. కానీ ఇటీవల మొన్న మొన్న 1962వ సం.లో ప్రచురించబడిన పుస్తకం వెల రూ. 15 లక్షలంటే తల తిరిగిపోతుంది. సుప్రసిద్ధ స్పానిష్ చిత్రకారుడు సాల్వడార్ డాలీ (Salvador Dali) రచించిన 'ది అపోకలిప్స్' (The Apocalypse) అనేదే ఈ గ్రంథం.

అత్యధికంగా వెల పలికే పుస్తకం స్పెయినుకు చెందినదైతే అతి పెద్ద 9అ. × 10 అ. (2.74 × 3.07 మీ) గ్రంథం అమెరికాకు సంబంధించినది. ఈ పెద్ద గ్రంథంలో 300 పుటలున్నాయి. దీని బరువు 253 కి.గ్రాలు. బ్రహ్మాండమైన ఈ పెద్ద పుస్తకం 1976వ సం.లో అమెరికా కాలో

“ఆచారం చెడినప్పుడు ధర్మాచరణ అధర్మాచరణగా మారును.”

రడోలోని డెన్‌వర్‌లో అచ్చు కావింపబడింది.

ప్రపంచంలో మిక్కిలి పెద్ద పరిమాణంలో ఉన్న పుస్తకాన్ని గురించి తెలుసుకున్న తరువాత సూక్ష్మాతి సూక్ష్మమైన చిన్న పుస్తకం ఏమిటి అవి తెలుసుకోడానికి కుతూహలం చెందడం సహజమే. ప్రపంచంలో అతి చిన్న పుస్తకాన్ని ప్రచురించిన ఘనత జపానుది. 'అరీ' (Ari) అంటే చీమ అనే 1/18 × 1/18 అం. (1.4 × 1.4 మి. మీ.) సుసూక్ష్మ గ్రంథం జపాను టోకియోలో అసో/హోషియో అనునతడు జూన్ 1980 లో ప్రచురించాడు.

అన్ని గ్రంథాలకు పేర్లుంటాయి. పేరు లేని గ్రంథం ఉండదు. కాని జి. డబ్ల్యు. హెడ్రీ 1859 వ సం.లో రచించిన పుస్తకానికి ఉన్నంత పెద్దపేరు ఇంకే పుస్తకానికి ఉండదు. దీని పేరు సుమారు 73 మాటలుండే చిన్న పేరా.

ఈ విధంగా కొంతమంది రచయితలు విలువలేని గ్రంథాలను రచించి ఇష్టమొచ్చిన పేర్లు పెట్టి తమ కాలాన్నే కాదు, ఇతరుల కాలాన్ని కూడా ఎంత వృథా చేస్తారో తెలుస్తుంది. 'ఫోల్డింగ్ టేబిల్ న్యాప్‌కిన్స్', 'మూవీస్టార్స్ ఇన్ బాత్‌టబ్స్', 'మాన్ హోల్ కవర్స్ ఆఫ్ లాస్‌ఏంజెల్స్', 'ఇంగ్లీష్ పిక్‌నిక్స్' మొదలైన నవలలను మీలో ఎంతమంది కొనుక్కోడానికి ఇష్టపడతారు?

అనేక మంది గ్రంథాలను రచిస్తారు, ప్రచురిస్తారు, ప్రకటిస్తారు, చదువుతారు. కాని పుస్తకంతో తాదాత్మ్యం చెందిపోయి ఒక భాగం అయిపోరు. ఇటువంటి విస్మయాన్ని కలిగించిన రచయిత జేమ్స్ ఎలెన్. ఇతడు అమెరికా ప్రభుత్వముచే బహిష్కరింపబడి 1837 వ సం.లో చెరసాలలో మరణించాడు ఇతడు వ్రాసిన స్వీయచరిత్ర పుస్తకాన్ని తన శరీరం చర్మంతో బైండు చేసి ఇతడి దోపిడీకి గురి అయిన వారిలో ఒకరికి బహూకరించమని చివరి కోరికగా చెప్పుకున్నాడు. ఈతడి ఈ కోరిక మన్నింపబడింది.

అన్నిటికంటే విపరీతంగా కనిపిస్తుంది భూటాన్ టక్‌ట్సాంగ్ దేవాలయంలో గ్రంథం. ఈ గ్రంథం చిన్న సంపుటంలో నల్లటి పుటలు స్వర్ణాక్షరాలతోను, శ్వేతాక్షరాలతోను వ్రాయబడింది. స్వర్ణాక్షరాలు సువర్ణంతో తయారైన సిరాతో వ్రాయబడ్డాయి. ప్రఖ్యాత మత గురువు లామా అస్థుల పొడిని ముద్దగా తయారుచేసి ఆ ముద్దతో శ్వేతాక్షరాలు వ్రాయబడ్డాయి. ప్రపంచంలో మిక్కిలి విచిత్రమైన గ్రంథం ఇదే కావచ్చు.

## 50 శాతం కుటుంబాలు మురికి వాడలలో నివసిస్తున్నాయి



బొంబాయినగరంలో సుమారు 50 శాతం కుటుంబాలు మురికి వాడలలో నివసించేవే. వీరిలో 10 శాతానికి కలర్ టీవి సెట్లు, 50 శాతానికి సాధారణ టీవి సెట్లు ఉన్నాయి.

"పాపఫలాలను అనుభవించడానికి ఇష్టపడరు, పాపకర్మలనే ఆచరిస్తారు. పుణ్యఫలాలను అభిలషిస్తారు గానీ పుణ్యకర్మలను ఆచరించరు."

# నమ్మలేని నిజాలు

## పెద్ద గబ్బిలమే ఫ్లైయింగ్ ఫాక్స్:



ఫ్లైయింగ్ ఫాక్స్ (ఎగిరే నక్క) నక్క కాదు. ఇది ఎగరదు. ఇది ఒక పెద్ద గబ్బిలం - గాలిలో జారుతుంది.

* * *

## పీనట్స్ బీన్స్:

పీనట్స్ (వేరుశనగ), బాదంపప్పు, జీడి పప్పువంటి పప్పులు కావు. ఇవి చిక్కుడు జాతికి చెందిన బీన్స్ - భూమి లోపల కాస్తాయి.

## కాంఫర్ బాల్స్ నాఫ్తలీన్‌తో తయారవుతాయి:

కాంఫర్ బాల్స్ (కర్పూరపు ఉండలు) అని చెప్పబడే ఉండలలో కర్పూరం ఉండదు. అవి నాఫ్తలిన్‌తో తయారవుతాయి.

* * *

## ఎర్ర సముద్రం నీలంగా ఉంటుంది:

ఎర్రసముద్రం (Red Sea) ఎర్రగా ఉండదు. అన్ని సముద్రాలలాగే నీలి రంగులో ఉంటుంది.

* * *

## బ్రహ్మాండమైన జ్ఞాపక శక్తి:

బ్రిటన్ పార్లమెంటు సభకు చెందిన వుడ్ ఫాల్' జ్ఞాపకశక్తి బ్రహ్మాండం. ఏ వివరాలు వ్రాసుకుని గుర్తించుకోకుండా ఏకంగా 3 గంటల కాలం చర్చలను విని తిరిగి తు.చ. తప్పకుండా చర్చవిషయాలను అన్నిక్రమంగా వ్రాయగల సమర్థుడు. ఒకసారి ఇతడు ఏ పొరపాటు లేకుండా 15 న్యూస్ కాలముల వార్తలు జ్ఞాపకం పెట్టుకుని పూర్తిగా వ్రాసి నట్టు రికార్డు కాబడింది.

* * *

## 24 సంవత్సరాల తరువాత చేరిన పోస్టు కార్డు:

రాజస్థాన్‌లో నావల్‌ఘర్‌లో ఒక వ్యక్తి వివాహ విషయాలను వివరిస్తూ వ్రాసి ఫిబ్రవరి 23, 1962న పోస్టుచేసిన కార్డు 24 సం.లు 1,000 కి.మీ. ప్రయాణంచేసి పశ్చిమ బెంగాల్ పురులియాలో ఉన్న అడ్రసీ మంగిలాల్ బసంతిలాల్ డాగాకు ఆగస్టు 27, న అందింది.

* * *

"పంచపాండవులు నరునిలోగల సద్గుణ సంపత్తి,
కౌరవులు నరునకుగల దుష్టగుణ సముదాయము."

# ఎస్.వి.శెట్టి - ప్రప్రథమ భారతీయ వైమానికుడు

టి. లక్ష్మయ్య గుప్త

ఎక్కాలి చిన్న ప్రాయంలో ఇంజనీరింగు శాఖలో అఖండ పేరు ప్రఖ్యాతులు గడించినవారు చాలా తక్కువ. వీరిలో ముఖ్యుడు శ్రీరామ వెంకట సుబ్బాశెట్టి. ఇతడి ప్రసిద్ధ నామం ఎస్. వి. శెట్టి. వైశ్య కులమునకు చెందిన ఇతడి తండ్రి శ్రీరామ తిప్పయశెట్టి. తల్లి సావిత్రి సాకమ్మ. మైసూరుకు చెందిన ఒక గౌరవ కుటుంబం




వీరిది. భారతదేశంలో మొట్టమొదట విమానాన్ని అమర్చి దానిని నడిపి దానిలో ప్రయాణం సాగించిన చతురుడు ఎస్. వి. శెట్టి.

ఇతడు మైసూరులో వెస్టర్న్ మిషన్ హైస్కూలులోను, మైసూరు మహారాజా వారి కళాశాలలోను విద్య నభ్యసించి 1900 సం.లో బి.ఏ. పరీక్ష ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడైయాడు. తరువాత ఇతడు ఉత్తర ప్రదేశ్ రూర్కీ ఇంజనీరింగ్ కాలేజీలో ఇంజనీరింగ్ విద్యను అభ్యసించాడు. ఇతడి సూక్ష్మగ్రాహక శక్తికి, అపూర్వమైన బుద్ధి కుశలతకి కాలేజీ అధ్యాపకులు ఆశ్చర్యపడి పోయారు.

రూర్కీలో ఇంజనీరింగు విద్యను ముగించి కొంతకాలం ప్రొబేషనరీ సబ్ అసిస్టెంటు ఇంజనీరుగా ఉద్యోగం చేసి ఎలక్ట్రికల్ మరియు మెకానికల్ ఇంజనీరింగ్ విద్యా విధానాలలో పెద్ద చదువులకు ఇంగ్లండుకు వెళ్ళారు. అక్కడ విల్సన్ అండ్ రాబిన్‌సన్ కంపెనీలో చేరి అధునాతనమైన సాంకేతిక విద్యను అభ్యసించాడు.

జూన్ 12, 1912న ఎ.వి. రావు అండ్ కోవారి అనుమతిని పొంది ఒక విమానాన్ని రూపొందించి తన అపూర్వ నైపుణ్యాన్ని ప్రదర్శించి బంగారు పతకాన్ని పొందాడు. ఆనాడు కలకత్తాలో ప్రసిద్ధి పొందిన ఇంగ్లీషు మాసపత్రిక "మోడరన్ రివ్యూ" ఇతడి విజయ సాధనలను గురించి వివరించింది.

(మిగతా 21 వ పేజీలో)

## ఢిల్లీలో పరిశోధక సంస్థలు

భారతీయ ప్రభుత్వంవారి 352 పరిశోధన మరియు అభివృద్ధి సంస్థలలో సగానికి పైగా ఏడు పెద్ద పెద్ద నగరాలలో నెలకొల్పబడ్డాయి. ఢిల్లీలో ఇవి చాలా ఎక్కువ-59 ఉన్నాయి.

“వీణాతంతులను చేతితో మీటినప్పుడే వీణయందు నాదమేర్పడును.”

# శబ్దతీవ్రత - మానవుని శ్రవణేంద్రియం

సాధారణంగా మానవుల శ్రవణేంద్రియం సున్న మొదలు 120 డెసిబిల్స్ శబ్ద తీవ్రతకు మిక్కిలి చైతన్యంగా ఉంటుంది. 120 డెసిబిల్స్ శబ్దం ఒకటి లేక రెండు సెకండ్లు కంటే ఎక్కువసేపు వినలేము. చెవులకు బాధగా ఉంటుంది.

ఇక ఇంట్లో రాత్రిపూట టీవి వేసుకోకుండా అందరూ పడుకుని ఉన్నప్పుడు 40 డెసిబిల్స్ శబ్దం ఉత్పన్న మవుతుంది. ఒక



చిన్న - పై 9వేటు ఆఫీసులో 60-65 డెసిబిల్స్ శబ్దం ఉంటుంది. పెద్ద పెద్ద ఆఫీసులలో 70-75 డెసిబిల్స్ శబ్దం వస్తుంది ఎవరైనా 3 అడుగుల దూరంలో ఉండి అరుస్తూంటే 80 డెసిబిల్స్ శబ్దం ఉత్పన్న మవుతుంది. 85 డెసిబిల్స్ దగ్గర మాటలు స్వచ్ఛంగా వినిపించవు.

20 అడుగుల దూరంలో యువకులు చేసే అల్లరి 90 మొదలు 95 డెసిబిల్సు. ఇటువంటి అధికస్థాయి డెసిబిల్స్‌తో శబ్దం చాలాసేపు వింటూంటే మన యువత 25 సంవత్సరాలు ప్రాయం వచ్చేటప్పటికి వినికిడి యంత్రాలు చెవులకు తగిలించుకోవలసిందే. మానవుని శ్రవణేంద్రియం అతి నాజూకుగా ఉంటుంది. తీవ్రమైన కఠోర శబ్దాలను ఎంతమాత్రం భరించలేదు.

( 20 వ పేజీ తరువాయి)

ఇతడు 1913 వ సం.లో మెకానికల్ ఇంజనీరింగ్ స్కూల్లో సూపరింటెండెంట్ ఉద్యోగాన్ని స్వీకరించాడు.

శెట్టి విమానం తయారుచేసి మన దేశంలో విమాన ప్రయాణం ప్రారంభించడానికి తగిన ఆర్థిక సహాయం ప్రభుత్వాన్ని కోరాడు. ఆనాడు భారతదేశపు గవర్నర్ జనరల్, అతడి సహచరులు ఇతడి కోరికను నిరాకరించి విమాన నిర్మాణానికి అనుమతిని ఇవ్వలేదు.

ఉదార స్వభావం గల శెట్టి తన ఆదాయంలో 16 వ వంతు ప్రత్యేకంగా స్త్రీ విద్యాభివృద్ధికి, వికాసానికి వెచ్చించేవాడు. అర్హులైన అనేకమంది విద్యార్థులకు కావలసిన ఆర్థిక సహాయం చేస్తుండేవాడు. 'కన్నడ టైప్‌రైటర్'ను డిజైనుచేసి నిర్మించిన ఘనత వీరికే దక్కుతుంది. అనేక విద్యాసంస్థలు విజ్ఞాన విషయాలలో ఇతడి సలహాలను కోరుతుండేవారు. ఇతడు అక్టోబరు 10, 1918 న మైసూరు యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా నియమింపబడ్డాడు. ఆ తరువాత కొంతకాలానికే విషజ్వరంతో మరణించాడు.

# ఆయుర్వృద్ధికి పెరుగు

హెచ్. కె. బ

అతి ప్రాచీన కాలంనుంచీ వివిధ దేశాల నిత్య ఆహారంలో పెరుగు ముఖ్యపాత్రను వహిస్తూంది. భారతదేశంలోను, టర్కీ, ఈజిప్టు, ఆర్మీనియా, యుగోస్లేవియా, రుమేనియా, రష్యా, మధ్యయూరప్ దేశాలలో పెరుగు ఆరోగ్యకరమైన ఆహారంగా ఉపయోగిస్తున్నారు.

పెరుగు మంచి పుష్టికరమైన ఆహారం. శరీరానికి అమూల్యమైన మాంసకృత్తులు, విటమినులు, విలువైన ఖనిజాలు ఇందులో



పుష్కలంగా లభిస్తాయి. కాల్షియం(సున్నం), రిబోఫ్లావిన్ కూడా ఇందులో లభిస్తాయి. పాలు త్రాగిన ఒక గంట తరువాత జీర్ణకోశంలో 32 శాతం మాత్రమే జీర్ణమైతే, అదే సమయంలో పెరుగు 91 శాతం జీర్ణమవుతుంది. జీర్ణావయవాలు అతి నాజూకుగా ఉండేవారికి ఇది మంచి సౌమ్య ఆహారం. ముఖ్యంగా పసిబిడ్డలకు, వృద్ధులకు మిక్కిలి ఆరోగ్యకరం.

సంపూర్ణమైన పాలనుండి తయారైన పెరుగులో 5 మొదలు 8 శాతం క్రొవ్వుపదార్థాలు, 3.2 మొదలు 3.4 శాతం మాంసకృత్తులు, 4.6 మొదలు 5.2 శాతం లాక్టోసు, 0.5 నుండి 1.1 శాతం లాక్టిక్ ఆసిడ్, 0.70 మొదలు 0.75 శాతం బూడిద, 0.12 మొదలు 0.14 శాతం సున్నం, 0.09 మొదలు 0.011 శాతం భాస్వరం, 0.3 శాతం ఇనుము, 85 మొదలు 88 శాతం తేమ ఉన్నాయి.

పెరుగులో కొన్ని ప్రత్యేక అపూర్వ రోగ నిరోధక, నివారక గుణాలు ఉన్నాయి. ఒక విధమైన సూక్ష్మజీవులు పాలను పెరుగుగా మారుస్తాయి. ఈ సూక్ష్మజీవులు ప్రేగులలో చేరి అక్కడ రోగప్రవృద్ధికరమైన జీవులను నశింపజేసి జీర్ణశక్తికి ఉపయోగపడే సూక్ష్మజీవులను ప్రవృద్ధి చేస్తాయి. సహాయకరమైన ఈ సూక్ష్మజీవులు ఖనిజాల వినియోగానికి, 'బి' గ్రూపుకు చెందిన విటమినుల సంయోగానికి సహకరిస్తాయి. పులిసిన పాలలో ఆమ్లములు, ఇతర లాక్టోసులు అనేక రోగాలను నివర్తిస్తాయి.

ముఖ్యంగా దీర్ఘరోగంగా పరిణమించిన మలబద్ధతకు, అజీర్ణ విరేచనాలకు దీనిని మించిన ఔషధం లేదు. పెరుగు మెదడుకి చల్లదనాన్ని కలిగిస్తుంది. ఇందులో లభ్యమయ్యే హైడ్రోక్లోరిక్ ఆమ్లము, పెప్సిన్, రెనిన్ మొదలైన రసాయనిక పదార్థాలు కడుపును ఆరిపోనీయకుండా కావలసినంత తేమగా ఉంచుతాయి. పెరుగు ప్రాణాపాయకరమైన క్యాన్సరు వ్యాధి నిరోధానికి ఉపయోగపడుతుంది. పెరుగు రక్తప్రవాహంలో ఉండే కొలెస్ట్రాలును తగ్గిస్తుంది. కాబట్టే

"విశ్వరూప సందర్శనం చేసుకుంటే గీతోపదేశమే కాదు
ఏ ఉపదేశమైనా సులభగ్రాహ్యమే."

గుండెజబ్బు గలవారికి మిక్కిలి లాభకారి. పెరుగు ఎక్కువగా తిని, తలకు కొద్దిగా పెరుగు మర్దన చేస్తే నిద్ర బాగాపడుతుంది. ఆయుర్వృద్ధికి పెరుగును వాడతారు. విశ్వాహారంలో చేరుతూన్న విషపదార్థాలకు పెరుగు విరుగుడుగా పనిచేసి శరీరానికి రోగనిరోధక శక్తిని కలిగిస్తుందని రష్యాలో నోబెల్ బహుమానాన్ని పొందిన సుప్రసిద్ధ బాక్టీరియాలజిస్టు ప్రొఫెసర్ మెట్కినికోఫ్ చెబుతున్నాడు.

టర్కీ దేశపు జారో ఆఘా (Zaro Agha) ముఖ్యంగా పెరుగుతో కూడిన ఆహారంతో 162 సంవత్సరాలు దీర్ఘకాలం జీవించగలిగానని చెబుతున్నాడు.

శరీర సౌష్టవానికి, సౌందర్యాభివృద్ధికి కూడా పెరుగు తోడ్పడుతుంది. ముఖ్యంగా తీక్షణమైన సూర్యరశ్మి వల్ల, ఎండ దెబ్బ వల్ల కందిపోయిన చర్మానికి పూర్వపు సౌకుమార్యాన్ని, సౌభాగ్యాన్ని కలిగించడానికి పెరుగులో అనేక పోషకాంశాలున్నాయి. పెరుగులో ఉండే సూక్ష్మజీవులు చర్మానికి మార్దవాన్ని కలిగించి నిగారింపు కలిగిస్తాయి. నారింజ లేక నిమ్మరసం చేర్చిన పెరుగు ముఖాన్ని శుభ్రపరుస్తుంది. ముఖ సౌందర్యాభివృద్ధికి అవసరమైన చెమ్మ, విటమిను 'సి' ఇందులో ఉన్నాయి.

ఒక చెంచాడు నిమ్మరసం గానీ, నారింజ రసంగానీ ఒక కప్పు పెరుగులో రంగరించి, ఆ మిశ్రమాన్ని ముఖానికి, మెడకి పట్టించి 15 నిమిషాలు ఆరనిచ్చి మెత్తని బట్టతోగానీ దూదితోగానీ మెల్లిగా తుడిచి శుభ్రమైన నీటితో కడుక్కుంటే ముఖం తాజాగా కళకళలాడుతుంటుంది. ఓటు ధాన్యం పిండి, పెరుగు, కలిపిన ముద్ద చర్మానికి మృదుత్వాన్ని కాంతిని కలిగిస్తుంది. శనగపిండి, పెరుగు కలిపి ముఖానికి పట్టించుకుంటే ముఖంపై లేచే పొక్కులు, మొటిమలు తగ్గిపోతాయి. ముఖసౌందర్యం పెరుగుతుంది. తల వెంట్రుకలు మెత్తబడి ఆరోగ్యకరంగా బలిష్టంగా పెరగడానికి, నిగనిగలాడుతూ ఉండడానికి పెరుగు ఉపయోగపడుతుంది. పెరుగును తలవెంట్రుకల మధ్య తల చర్మానికి పట్టించి 30 నిమిషాల తరువాత శుభ్రమైన నీటితో కడగాలి. మూడు రోజులు ఆరుబయట ఉంచిన పెరుగును తలకు బాగా మర్దనా చేస్తే తలలో లేచే చుండ్రు తగ్గుతుంది.

## అంతరిక్షంలో 10,00,00,000 తోకచుక్కలు



అంతరిక్షంలో 10,00,00,000 తోకచుక్కలున్నాయి. ఇవి చాలామటుకు మిక్కిలి చిన్నవి. కానీ హేలీ తోకచుక్కతో సహా 50 ఇతర పెద్ద పెద్ద ధూమకేతువులు 100 సం. లలో తిరిగివస్తాయి. 40 తోకచుక్కలు 5 మొదలు 8 సం. లలో తిరిగి వస్తాయి. 3 కోట్ల సంవత్సరాల తరువాత తిరిగివచ్చే తోకచుక్క కూడా ఉంది.

"బ్రహ్మాండ స్వరూపుడైన పరమాత్మ దర్శనం దుర్లభం."

# ఫ్లామింగో నగరం

గుజరాత్ రాష్ట్రంలో గ్రేట్ రాన్ ఆఫ్ కచ్ (Great Rann of Kutch) ని ఫ్లామింగో నగరం అంటారు. అందమైన ఫ్లామింగో పక్షులు ప్రవృద్ధిపొందే ప్రదేశం ఇదే. ఇక్కడ నివసించే వేలకొద్దీ ఫ్లామింగోలు అద్భుత దృశ్యాన్నిస్తాయి. ప్రపంచం అంతటా 23 రకాల పెద్ద ఫ్లామింగోలు (Great Flamingoes) ఉన్నాయి. ఐరోపా మరియు ఉత్తర అమెరికా జంతు ప్రదర్శనశాలలలో చిన్న ఫ్లామింగోలను




కూడా విజయవంతంగా పెంచగలుగుతున్నారు.

ఆసియా ఖండంలో ఒక అహమ్మదాబాద్ (గుజరాత్) జంతు ప్రదర్శనశాలలో మాత్రమే ఫ్లామింగోలు ప్రతి సంవత్సరం ప్రవృద్ధి చేయబడుతున్నాయి. మగ ఆడ ఫ్లామింగ్ పక్షులు ముక్కులతో గూళ్ళను నిర్మిస్తాయి. ఆడపక్షి పెట్టే ఒకే ఒక గ్రుడ్డుని తల్లి తండ్రి పక్షులు రెండూ 28 రోజులపాటు పొదుగుతాయి.

ఫ్లామింగోలు సాధారణంగా ఉప్పునీటి లేక క్షారపు నీటిపక్షులు_జంతుశాలలలో వీటికి ఎండు చేపల పొడి, ఎండు రొయ్యల పొడి, గింజ ధాన్యాలు, ఆకుపచ్చని కూరలు, కొద్దిగా క్యారటు ముక్కలు, బీటు దుంప రసం మొదలైనవి ఆహారంగా పెడతారు. వీటివల్లే అవి తమ సహజమైన గులాబి రంగును నిలబెట్టుకోగలుగుతున్నాయి. సహజంగా నివసించే ఫ్లామింగోలు బురదలో లభించే సేంద్రియ పదార్థాలను తింటాయి. వీటి ముక్కులు వంగి ఉండటంవల్ల ముక్కు ద్వారా బురదనీరు బయటకు పోతుంది. చిన్న చిన్న పురుగులు, ఆకులు, అలములు మాత్రం నిలబడతాయి.

చిన్న ఫ్లామింగోలు (Lesser Flamingoes) పెద్ద ఫ్లామింగోలు (Great Flamingoes)లు లాగే ఉంటాయి. చిన్న ఫ్లామింగోలు పరిమాణంలో కొంచెం చిన్నవి. ఈకెలు రెక్కలు ఎర్రని రోజారంగులో ఉంటాయి.

## కార్య నిరతి క్రమశిక్షణకు దోహదం కలిగిస్తుంది

విలాసవంతమైన ఆటవస్తువులు భావ చైతన్యాన్ని ఉత్తేజపరుస్తాయి. సుశ్రావ్యమైన సంగీతం మానసిక సౌకుమార్యాన్ని కలిగిస్తుంది. కార్య నిరతి క్రమశిక్షణకు దోహదకారి. వైజ్ఞానిక విధానంలో నిర్వహింపబడే పాఠశాలలు విద్యార్థుల శారీరక, మానసిక, నైతికాభివృద్ధికి, రసపిపాసకు పునాదులు వంటివి.

—స్వామీ చిన్మయానంద

"ప్రాతదైనను, క్రొత్తదైనను సాహిత్యరీతి ఉదాత్తమైతే స్వీకరించక తప్పదు."

# జంతువులలో వింత అలవాట్లు

ప్రెస్టన్ అహిమాజ్

అసాధ్యం అని అనిపించే పనులు చేయడానికి అపూర్వమైన శక్తి కొన్ని జంతువులలో అభివృద్ధి పొందింది. న్యూజిలాండులో చిలుకజాతికి చెందిన కీ (Kea) సాధారణంగా చిలుకలు తినే పళ్ళు, గింజలు తినడం మానేసి పూర్తిగా మాంసాహారిగా మారిపోయింది!

దక్షిణ అమెరికాలో నివసించే బల్లి జాతికి చెందిన బాసిలిస్క్ (Basilisk) వెనుక కాళ్ళ సహాయంతో నీటి పైతలం మీద పరుగెత్తుతుంది. చివరికి అది నీటిలో మునిగిపోతూన్నా ఈదుకొని బయట పడుతుంది.




పెద్ద పెద్ద కోరపళ్ళతో చిన్న జీర్ణాశయంతో రాకాశి పాండా మాంసాహారిగా కనిపిస్తుంది. కానీ ఈ పాండా పూర్తిగా శాకాహారి. వెదురు చిగుళ్ళు మాత్రమే కొరుక్కు తింటుంది.

పేడపురుగు (dung beetle) చిన్న చిన్న పేడ ఉండలను తయారుచేసి త్రోసుకు వెడుతుంది. సాధారణంగా దానికంటె ఎన్నో




రెట్లు పెద్ద పెద్ద ఉండలతో గుడ్డును చేర్చి భూమిలో పాతిపెడుతుంది. ఈ విధంగా పొదగబడి పెద్దదైన పురుగుకి ఆహారం సేక

## భావపరిచయపోటీ

(మార్చి 1987)

"దుష్టులతో సహవాసం
దురవస్థకు సోపానం."

—కుమారి కుప్పచ్చి లావణ్యలక్ష్మి,
జిల్లేళ్ళమూడి.

* * *

"సహవాస దోషం
పతనానికి కారణం."

—టి. మురారి, దోని.

"నవనవోన్మేషమైన ప్రజ్ఞని ప్రకటించే ఆశువులు చాటువు లవుతాయి."

రించి పెడుతుంది. టారాంటులా కందిరీగ పెద్ద పెద్ద భయంకరమైన టారాంటులా సాలె పురుగులను కుట్టి చంపి వాటిని లార్వాకి మేతగా పెడుతుంది.

ఎలుగుగొడ్డులా కనిపించే స్లాత్ మంతా పెద్ద పెద్ద వాడి గోళ్ళ సహాయంతో చెట్లకొమ్మల నుంచి తలక్రిందులుగా వ్రేలాడుతూంటాయి. ఎప్పుడైనా అరుదుగా భూమి మీదికి దిగుతుంది. ఇదే విధంగా నీటి ప్రవాహంతో నిండిపోయిన కొండ గుహల్లోను, సొరంగాలలోను కేట్‌ఫిష్ (మార్జాల మత్స్యం) తల క్రిందుగా నీటిలో ఈదుతుంది.

కొన్ని జంతువులకు చిత్రవిచిత్రమైన వింత అలవాట్లు ఉంటాయి. చేపలలో



ముఖ్యంగా సిచ్‌లిడ్ (Cichlid) అనే చిన్న రకం చేపలు తమ కుటుంబాన్ని అతి జాగ్రత్తగా సంరక్షించుకుంటాయి. తీవ్రమైన అపాయం సంభవిస్తుందనే సమయంలో చిన్న చిన్న వాటివి నోటిలో పెట్టుకుంటాయి. వాస్తవంగా మత్స్యజాతికి చెందిన మగ సముద్ర గుర్రం (నీటి గుర్రం) ఆడ గుర్రం పెట్టిన గ్రుడ్లను తన కడుపులో పెట్టుకుని పొదుగుతుంది. పిల్లలకు సంరక్షణ చేస్తుంది. పెయింటెడ్ స్నైప్ అనే పక్షులలో ఆడవి మగవాటికంటె చాలా పెద్దవి. మంచి రంగులతో అందంగా ఉంటాయి.


Two-toed Sloth

వీటిలో మగపక్షులే కుటుంబాన్ని సాకుతాయి.

అన్ని పక్షులు గూళ్ళను కట్టుకోవు. అంటార్టికాలో పెంగ్విన్ జాతి పక్షులు అవి పెట్టే ఒక గ్రుడ్డును సాధారణంగా కాళ్ళమీద

---

## ప్రపంచంలో మొట్టమొదటి అంకెల నిఘంటువు

ప్రపంచంలో అపూర్వమైన మొట్టమొదటి అంకెలలో ఏర్పరచిన నిఘంటువును, న్యూఢిల్లీలో యూనివర్సల్ డిజిటాల్ కమ్యూనికేషన్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ వారు తయారు చేసారు. సాంప్రదాయకమైన లిపి లేకుండా సున్న నుండి 9 వరకు గల అంకెలను దీంట్లో ఉపయోగించారు. వీడియో టర్మినల్ మీద కీ బోర్డులో కొన్ని అంకెలను పంచ్ చేస్తే హిందీ, సంస్కృతం, లేక ఇంగ్లీషు వాక్యం అచ్చయి వస్తుంది.

"ఇది ఆత్మ - ఇది అనాత్మ అన్న వివేకం లేకపోవటం బంధానికి హేతువు."

పెట్టుకుని చర్మం మడతతో కప్పి పొదుగుతుంది. ఒక్కొక్కప్పుడు ఒక జాతి జంతువులు మరోజాతి జంతువులతో అత్యంత అన్యోన్యాన్ని ప్రదర్శిస్తాయి. పెద్ద పెద్ద మొసళ్ళు నోళ్ళు తెరుచుకుని నీటిగట్లమీద ఎండలో పడుకుంటాయి. నీటిపట్టున ఉండే పక్షులు భయంకరమైన వీటి నోటిలో చిక్కుకు పోయిన చిన్న చిన్న ఆహారం ముక్కలను నైపుణ్యంగా తీస్తాయి. కొల్లగొట్టి దోచుకుతినే భయంకరమైన చేప బర్రాకూడె (Barracude) వాడియైన కోరలను, చిన్న చిన్న ర్రాసే (Wrasse) అనే పక్షులు ముక్కులతో పొడిచి శుభ్రం చేస్తాయి.



పై అన్యోన్య సంబంధంలో పరస్పరం లాభం కనిపిస్తుంది. కొన్నిటిలో ఒక జాతికే లాభం కలుగుతుంది తేనెటీగలను తినే కారమైన్‌లు భూమిమీద సంచరించే పక్షుల మీద ఉంటాయి. ఆ పక్షులు ముక్కులతో పొడిచినప్పుడు చెదిరిపోయిన కీటకాలను అవి తింటాయి. డేమ్‌పెల్ ఫిష్, క్లౌన్ ఫిష్ వంటి చేపలు సీ అనిమోన్స్ (Sea Anemones) మరియు జెల్లీ చేపలను అంటిపెట్టుకుని తమకు రక్షణను కలిగించుకుంటాయి.

ఈ విధంగా అనేక రకాల జంతువులున్నాయి. ఇవన్నీ ప్రకృతిలో ఒక భాగం. ఇటువంటి ప్రకృతిని మానవుడు నాశనం చేస్తున్నాడు. మొసళ్ళు, రినోసరస్, పాండాలు మొదలైనవాటిని ఇక ముందు మన పిల్లలు బొమ్మలను చూసి తెలుసుకోవలసిందే. పూర్తిగా నశించిపోకముందే తగిన జాగ్రత్తలు తీసుకోడం మన కర్తవ్యం.

## సుభాషితాలు

కనగ బొమ్మలెన్నొ కనకంబదొక్కటి
పసుల వన్నెలెన్నొ పాలొకటియె
పుష్పజాతులెన్నొ పూజయొక్కటె సుమీ
విశ్వదాభిరామ వినురవేమ!

[నగలు ఎన్ని రకాలైనా బంగారం ఒక్కటే. పశువులు వివిధ వర్ణాలలో ఉండవచ్చు కాని పాలు ఒక్కటే. పువ్వులు ఎన్ని రకాలున్నా పూజ సమానం. పండితులు వేరైనా జ్ఞానం ఒక్కటే.]

* * *

ఉన్న ఘనతబట్టి మన్నింతురేకాని
పిన్న పెద్దతనము లెన్నబోరు
వాసుదేవు విడిచి వసుదేవు నెంతురా!
విశ్వదాభిరామ వినురవేమ!

[గొప్పతనాన్ని బట్టే గౌరవమర్యాదలు కలుగుతాయి. వయస్సుతో పనిలేదు. శ్రీకృష్ణునే గౌరవిస్తారు గానీ వసుదేవుని గౌరవించరు.]

"ఏ రూపంలో ఏది నిశ్చితమో దానినుండి తొలగిపోనిది సత్యం."

# నిజాలు - నిదర్శనాలు

## గ్రామాలను సన్నిహితం చేస్తున్న వాతావరణానుకూల మార్గాలు:



గ్రామీణాభివృద్ధి శాఖవారు సమర్పించిన 1985-86 సం. పు సమాచారం ప్రకారం మార్చి 31, 1985 నాటికి 1,500 కు పైబడిన జనాభా గల 70.48 శాతం గ్రామాలకు, 1,000 కి 1,500 కి మధ్య జనాభా గల 52 శాతం గ్రామాలకు, 1,000 కంటే తక్కువ జనాభా గల 27 శాతం గ్రామాలకు వాతావరణానుకూలమైన మార్గాలను కల్పించారు.

* * *

## 40 వేల మంది కార్మికులతో ఒక మిలియను టన్ను ఉక్కు:

దక్షిణకొరియా 14 వేల మంది కార్మికులతో 9.10 మిలియను టన్నులు ఉక్కును ఉత్పాదిస్తూంటే, భారతదేశం 40 వేల మంది కార్మికుల సహాయంతో ఒక మిలియను టన్ను ఉక్కును మాత్రమే ఉత్పాదిస్తూంది.

* * *

## రికార్డు స్థాయిలో ఏలకుల ఎగుమతి:

1984-85 సంవత్సరంలో భారతదేశం ఇంతవరకూ ఎన్నడూలేని రికార్డు స్థాయిలో రూ. 63.53 కోట్ల విలువ గల 2,340 టన్నుల ఏలకులను ఎగుమతి చేసింది.

* * *

## కేరళకు 30 శాతం ఆదాయం కొబ్బరిమీద లభించినదే:



కేరళరాష్ట్రం మొత్తం వ్యవసాయంమీద వచ్చే ఆదాయంలో 30 శాతం కొబ్బరి మీద లభించినదే. ఇక్కడ ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ 10 మిలియను మంది జీవనోపాధికి ఈ పరిశ్రమే ముఖ్యాధారం. త్రాడు ఉత్పత్తి, ఎండుకొబ్బరి పరిశ్రమ మరియు నూనె ఆడుట మొదలైన కొబ్బరికి సంబంధించిన వివిధ పరిశ్రమలలో ఒక మిలియనుమంది పనిచేస్తున్నారు.

* * *

"జ్ఞానము, కర్మ, భక్తి అనునవి భగవంతుని పొందుటకు సాధనములు."

## అమెరికాలో 17,530 భారతీయ వైద్యులు:

ప్రస్తుతం అమెరికాలో 14,000 భారతీయ శాస్త్రజ్ఞులు, 17,530 భారతీయ వైద్య నిపుణులు ఉన్నారు.

* * *

## మొత్తం రైలు రవాణా సరకులో నాల్గవ వంతు బొగ్గు:



ఎక్కువగా రైలు రవాణాచేసే సరకులలో సుమారు నాల్గవవంతు బొగ్గు. మొత్తం రవాణాచేసే సరకులలో ఆహారధాన్యాలు 15 శాతమైతే ముడి ఇనుము, ఉక్కు 9 శాతం.

* * *

## ప్రపంచం జనాభాలో మూడవ వంతు నగర ప్రదేశాలలో నివసిస్తున్నారు:

గత 20 సంవత్సరాలలో ఒక మిలియను లేక దానికి పైబడిన జనాభా గల నగరాలు 30 నుండి 200 దాకా పెరిగిపోయాయి. 1.00,000 మంది నివసిస్తున్న పట్టణాలు సుమారు 2,000 ఉన్నాయి. ప్రపంచ జనాభాలో మూడవ వంతు నగర ప్రదేశాలలోనే నివసిస్తున్నారు.

( 2 వ పేజీ తరువాయి)

ఇతోధికంగా పెంచుకోవాలి నిశ్చయమైన సరళవంతమైన సక్రమమార్గం నిర్మించుకోవాలి. చేసుకున్న వారికి చేసుకున్నంత ఒక వస్తువు మీద బలం ప్రయోగిస్తే వెంటనే సరిసమానమైన ప్రతిబలం ఏర్పడుతుంది. అఘాతానికి ప్రత్యాఘాతం ఉండక మానదు క్రియకి ప్రతిక్రియ సహజం హేతువు ఉంటే ప్రయోజనం ఉండి తీరుతుంది. ప్రపంచంలో కార్యకారణ సంబంధం ఒక నియతి-మరచిపోకు అదే ప్రకృతి ధర్మం. నీవు సర్వతంత్ర స్వతంత్రుడవని అనుకోకు కార్య కారణాలు ధర్మకాటాలో సర్వసమానంగా తూగుతాయి. చేసుకున్న కర్మ ఫలం అనుభవింపక తీరదు చెడు తలపెట్టావా అష్టకష్టాలతో పాపాలను అనుభవిస్తావు మంచి చేసుకున్నావా పుణ్యాన్ని అనుభవించకపోవు కాబట్టి సర్వభూతరతితో వ్యవహరించు. లోకమంతా నీ ఔన్నత్యానికి సహకరిస్తుంది. వైరంతో ప్రారంభించావా దుఃఖ సాగరంలో మునుగుతూ తేలుతూంటావు. చుట్టూ సామరస్యం పెంచుకో. విశ్వమైత్రి విశ్వభోగం కలిగిసుంది.

"అది లేని దానియందు అది ఉన్నట్లు తలంచుట మిథ్యాజ్ఞానము."

# అంటార్కిటికా పరిశోధక యా

ప్రపంచంలో ఉన్న వివిధ ప్రదేశాలలో అతి బ్రహ్మాండంగా విపరీతమైన వాయువులతో, తుఫానులతో, చలితో గజగజలాడించే ప్రదేశం అంటార్కిటికా. అభివృద్ధి పొందుతున్న వర్ధమాన దేశాలలో ఒక్క భారత దేశమే దీని పరిశోధనకు ఇతర సహాయం లేకుండా పూనుకుంది.

1. అమూల్యమైన బొగ్గు, ఇనుము, యురేనియం, రాగి, సీసము, ఇతర నూనెలు, ఇంధన వాయువులు మొదలైనవి అంటార్కిటికాలో విస్తారంగా లభిస్తాయని భూగర్భ



శాస్త్రజ్ఞుల ముఖ్య అభిప్రాయం

2. అంటార్కిటికా హిమానీ నదము పూర్తిగా భూతలపు మంచు ప్రదేశంలో 90 శాతం ఉంది కాబట్టి అంటార్కిటికాలో స్ఫటికాల వంటి అపూర్వమైన మంచినీటి వనరులు లభిస్తాయి.

3. పారిశ్రామిక ప్రదేశాలకు బహుదూరంగా ఉండటంవల్ల అంటార్కిటికా ఏ విధమైన కాలుష్యాలు లేకుండా నిష్కల్మషంగా ఉండడానికి అవకాశం ఉంది. దీనివల్ల ప్రపంచంలో ఇతర చోట్ల కాలుష్యాల వల్ల కలిగే మార్పులను సులభంగా గ్రహించడానికి వీలు కలుగుతుంది.

4. సూర్యగోళం నుంచి వచ్చే విద్యుదావేశం పొందిన కణాల సంయోగంతో అయస్కాంత క్షేత్రం చెందే మార్పును పరిశోధించడానికి అంటార్కిటికా ముఖ్యమైన ప్రదేశం.

5. అంటార్కిటికా జలాశయాలలో కొన్ని అపూర్వప్రాణులు విస్తారంగా జీవించడానికి ఇవి అనుకూలవంతంగా ఉన్నాయి. అంటార్కిటికాకే ముఖ్యమైన సూక్ష్మజీవులు క్రిల్ (krill) వంటి రెడ్ ష్రింప్.

6. మెసోజోయిక్ యుగంలో ఆఫ్రికా, అంటార్కిటికా, ఆస్ట్రేలియా, ఇండియా, లాటిన్ అమెరికా ఖండాలు అయిదు చేరి గోండ్వానా లాండ్ ఏర్పడింది. ఆ తరువాత ఈ ఖండాలు విడిపోయి విడివిడిగా జలాశయాలతో వేరుచేయబడ్డాయి.

7. ఉత్తర దక్షిణ ధృవాలు ప్రపంచపు వేడిమిని సమతూకంగా ఉంచుతాయి. వాతావరణం ద్వారా, మహా సముద్రాల ద్వారా ధృవాలకు ప్రసరించే ఉష్ణం ఆకాశంలో దీర్ఘ తరంగవికరణం (Long wave radiation) చెంది చెదిరిపోతుంది.

## విద్యార్థులకు రెండు వ్రాయడం నేర్పుతారు

ప్రపంచంలో ఒక్క జపాన్ దేశంలోనే విద్యార్థులకు కుడి, ఎడమ రెండు చేతులతో వ్రాయడం నేర్పిస్తారు.

"బాధపడుచున్న వానితో ఒక దయగల మాట మాటలాడుటయే పరమధర్మం."

# 'టెన్షన్' పోగొట్టుకోవాలంటే?

ఎఫ్. స. సోంది

మనస్సులో ఒత్తిడి (tension) ఎక్కువై పోతూంటే నీవు ఏ పనీ సాధించలేవు. కేంద్రనాడీమండలం సరిగా పనిచేయదు. చివరికి ప్రాణానికే ముప్పు సంభవిస్తుంది. మానసిక ఒత్తిడి తగ్గించుకోవాలంటే—

* నీకు బాగా నచ్చిన మంచి పుస్తకాన్ని చదవడం ప్రారంభించు. ఆధ్యాత్మికసంబంధమైన గ్రంథాలు, నైతిక గ్రంథాలు, పుణ్య పురుషుల జీవిత చరిత్రలు, చారిత్రక



గ్రంథాలు మొదలైనవాటిని సేకరించి అమూల్యమైన చిన్న స్వంతగ్రంథాలయాన్ని నిర్మించుకో.

* సమస్యలను వివరంగా వ్రాసి పెట్టుకో. జరిగిపోయిన విషయాలను గురించి పూర్తిగా మరచిపో. వాటిని గురించి మధనపడిపోకు. ఎప్పుడో ఏదో జరుగుతుందని భయపడిపోకు. భవిష్యత్తు నీకెప్పుడూ మరుగే. గతించిన వాటిని గురించి, రాబోయేవాటిని గురించి తికమకలు పడిపోకు, భూతకాలంతోగానీ, భవిష్యత్తుతోగానీ సంబంధాన్ని వదలుకో. వర్తమానం అంటావా? తొందరపడకు. స్థిమితంగా ఒక్కొక్క విషయం తీసుకో. ప్రతీదానికి ముందు వెనకలు బాగా ఆలోచించు. తీవ్రంగా పరిశోధించి పరిష్కారానికి ప్రయత్నించు.

* వ్యసనపడిపోయి విచారంతో బాధపడిపోతూ వేదనతో వ్యధ పెంచుకోకు. ఆందోళన మాను. మనోమందిరాన్ని నిరామయం చేసుకో. నీలో వెలిగే బుద్ధిదీపాన్ని ప్రజ్వలింప జేసుకో. ఉత్సాహంగా ధైర్యంతో సమస్యా పరిష్కారానికి మార్గాలు వెతుకు. నీ మనస్సును నీ అధీనంలో ఉంచుకుంటే నీ జీవితం శోభాయమానంగా వెళ్ళిపోతుంది. ఎప్పుడు ఉత్సాహం పెంచుకుంటావో అప్పుడే శ్రద్ధ, ఏకాగ్రత, నిష్ఠ అలవడతాయి. సమస్యలు సౌలభ్యంగా పరిష్కారం చేసుకోడానికి అనుకూలవాతావరణం ఏర్పడుతుంది.

## హనుమంతుని ప్రార్థిస్తూ మరణించిన కోతి

చిత్రకూట్ ధమ్‌లో హనుమాన్ ధారా వద్ద కూర్చుని నమస్కారం చేస్తూ హనుమంతుని ప్రార్థిస్తూన్న ఒక కోతి కూర్చున్నది కూర్చున్నట్టే మరణించింది. అక్కడ జనం దానికి పసుపు రాసి చిత్రకూట్ దగ్గర పైస్వానీ నదిగట్టున హిందూ సాంప్రదాయం ప్రకారం అంత్యక్రియలు సలిపారు.

"కాలు జారకముందే మంచి త్రోవలో పయనముచేయుట శ్రేయస్కరము."

* ఆత్మవిశ్వాసంతో, కృతనిశ్చయంతో అన్ని సమస్యలను ఎదుర్కొగలుగుతున్నా ననే ధైర్యంతో ప్రారంభించు. నమ్మకం లేకపోతే జీవితం శూన్యమైపోతుంది. అభినివేశంతో, పట్టుదలతో చాకచక్యంగా సమస్యా పరిష్కారానికి పూనుకో.

* ఒక్కసారి చీకటి గదిలోనుంచి బయటికి రా. వెలుతురులోకి వెళ్ళు. ఆరుబయట తోటలో తిరుగు. జీవితం అంతా తేజోమయమైపోతుంది.

* ఇంటిపట్టు వదులుకో. సమాజాలకు వెళ్ళు. సమావేశాలలో పాల్గొను. ఆధ్యాత్మిక ప్రవచనాలను విను. పురాణ శ్రవణం చేయి.

* నీవు ఒక్కడివే అనుకోకు. స్నేహితులు ఎంతోమంది ఉన్నారు. స్నేహితులను సందర్శించు. వారిని పరామర్శించు. వారిని ఆహ్వానించు. విందు ఏర్పాటు చేయి.

ఆధ్యాత్మిక పథంలో ధ్యాన సాధన అలవాటు చేసుకో. శ్రమపడితేగాని ఏ పనీ సిద్ధించదు. నిగ్రహం అభ్యాసం చేసుకో. మనస్సు దుడుకుగా ఉంటే దారీ తెన్నూ తెలియదు. కష్టాలలో బెదిరిపోవటం ఎందుకు? నీ కోరికలలో, నీ ఆవేశాలలో, నీ ఆశయాలలో, నీ ఆలోచనలలో అనంత తత్త్వం విస్తరించుకుపోయి ఉంటుంది. దాన్ని అవగాహన చేసుకో. శాంతస్వభావంతో, సర్వశక్తిమంతుడైన భగవంతుని మీద విశ్వాసం పెంచుకో. దైవాన్ని ఆరాధించు. సర్వోత్కృష్టమైన దివ్యసహాయాన్ని అర్థించు. దేముడు మేలు చేయక మానడు.

* అనుకున్నది సిద్ధించినా, సిద్ధించక పోయినా జరిగేది జరగక మానదు. నీ విధి నిర్ణయం అలా ఉంది. ఎందుకు వృధాచింత. అలా అని నీ ప్రయత్నాలు, నీ సాధనలు విరమించుకోకు సుమా! భగవదేచ్ఛ అకస్మాత్తుగా మారిపోయి నీ కష్టాలన్నీ తీరిపోయి నీవు గట్టెక్కిపోవచ్చు. శక్తిపంచన లేకుండా ఆత్మవిశ్వాసంతో ప్రయత్నిస్తే సాధించలేనిది ఏముంది నీకు?

* 'సోమరుల బుద్ధి దయ్యాల కొంప' అంటారు. ఊరికే గోళ్ళు కొరుక్కుంటూ కూర్చుంటే మనస్సు ఊరికే ఉండదు. ఎప్పుడూ ఏదో వ్యాపకం పెట్టుకో. ప్రపంచంలో జీవిత రహస్యాన్ని తెలుసుకో. చింతకు మనస్సులో ఏమాత్రం తావు ఇవ్వకు. ఉషారుగా ఉండు. శారీరక శ్రమ వల్లకాదు - మనస్సులో కలిగే ఒత్తిడి వేదనల మధ్య ఉక్కిరి బిక్కిరై నలిగిపోతూ అశక్తుడవై పోతున్నావు.

## 1,500 మి.సం.ల క్రితం ఏర్పడిన రాతి ఆర్చి



ఆంధ్రప్రదేశ్ చిత్తూరు జిల్లాలో 1,500 మిలియను సంవత్సరాలకు పూర్వం నీటి ప్రవాహం వల్ల, గాలి ప్రవాహం వల్ల పెద్ద రాతి ఆర్చి ఏర్పడింది. ఆ పెద్దరాయి 2,500 మిలియను సంవత్సరాల నాటిది. ఆసియాలో ఇటువంటి ఆర్చి ఇది ఒక్కటే. ఇది 25 అ పొడవు 10 అ. ఎత్తుగా ఉంటుంది.

"మోక్షం అనేది పొందదగినది కాదు, అంతరాయాలు తొలగించుకుని అనుభవింప దగినదే మోక్షం."

# అవీ - ఇవీ

### నవ్వు అతి చవకగా లభించే విలాసం:



మానవుడు ఏ ఖర్చు లేకుండా అనుభవించగలిగిన అమూల్యమైన విలాసం నవ్వు. నవ్వు శరీరంలో రక్తప్రవాహాన్ని ఉత్తేజపరుస్తుంది. హృదయాన్ని విస్తరింపజేస్తుంది. నాడీమండలానికి ఉద్దీపన కలిగిస్తుంది. మనస్సులో పట్టిన బూజును దులిపేస్తుంది. శరీరానికి పూర్తిగా నవచైతన్యాన్ని కలిగిస్తుంది.

* * *

### సుగంధ కుసుమాలతో సౌభాగ్య సమృద్ధి

ఇజ్రేయిల్ నుంచి భారతదేశం దాకా, సింగపూరు నుంచి దక్షిణ కొరియా దాకా అనేక ఆసియాదేశాలలో వివిధ రంగులలో, రకరకాల ఛాయలలో పరిమళభరితమైన పువ్వులు అత్యధిక ఆదాయాన్ని చేకూరుస్తున్నాయి. ఆసియాదేశపు పువ్వులు ముఖ్యంగా పశ్చిమ ఐరోపా మరియు ఉత్తర అమెరికా మార్కెట్లలో స్థానం చేసుకున్నాయి.

### సోవియెట్ యూనియన్‌కి చెందిన మొట్టమొదటి వేగవంతమైన రైలు

అత్యధిక వేగం గల ప్రప్రథమ సోవియెట్ యూనియన్ రైలు మాస్కో, లెనిన్‌గ్రాడ్‌ల మధ్య ప్రయాణం చేస్తుంది. ఇది 8 గం.ల ప్రయాణపు సమయాన్ని 5 గంటలకు తగ్గించింది. అల్యూమినియంతో తయారైన ఈ రైలు మామూలు రైలు మార్గం మీద గంటకి 180 కి.మీ. వేగంతో 700 కి.మీ.లు ప్రయాణం చేస్తుంది.

* * *

### అగ్గిపెట్టెలు 74 శాతం శివకాశిలో తయారైనవే.

భారతదేశంలో ఉత్పాదింపబడే అగ్గిపెట్టెలలో 74 శాతం - సుమారు 20,000 మిలి

## మీరైతే...?

(మార్చి 1987)

('పనులయందు నేర్పరితనమే యోగం' అంటే?)

"యోగం శరణ్యం అనుకోకుండా సాధన చేస్తాను."

—పి. సత్యప్రభ, విశాఖపట్టణం.

* * *

"కంప్యూటర్లొస్తున్నాయిగా!"

—ఎన్.ఎస్. ప్రకాష్, కొడిమియాల్.

"సమస్త ప్రాణులలో గల ఆత్మ, తన ఆత్మ ఒకే స్వరూపంగా ఉంటాయి అని తెలుసుకోటం జ్ఞానం."

యను అగ్గిపెట్టెలు తమిళనాడులోని శివ కాశిలో తయారవుతున్నాయి.

* * *

**బొంబాయి నగరంలో 10 మిలియను లోకల్ కాల్స్:**

బొంబాయి నగరంలో టెలిఫోను సంస్థ రోజుకి 10 మిలియను లోకల్ కాల్స్‌ను నిర్వహిస్తూంది.

**చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంలో మిక్కిలి సమర్థుడు:**

రాజస్థాన్‌లో చిత్తోర్‌ఘర్ జిల్లా చిన్న మొత్తాల పొదుపు అధికారి శ్రీ పి. సి. గెమవాట్ 1984_85 సం.రానికి దేశంలో మిక్కిలి సమర్థవంతమైన అధికారిగా నిర్ణయింపబడ్డాడు. 1984_85 సం.లో తన జిల్లా రూ. 1.15 కోట్ల లక్ష్యానికి రూ. 1.59 కోట్ల పొదుపు మొత్తాన్ని ప్రోగుచేసి రికార్డు సాపించాడు.

**చైనాలో అపూర్వమైన 'హరిత మందిరం':**

చైనాలో వృక్షశాస్త్రజ్ఞులు, దూరంగా పర్వత పీఠభూమిలో అపూర్వమైన 'హరిత మందిరాన్ని' కనుగొన్నారు. ఇక్కడ 'హిమయుగం' నాటి మొక్కలు అన్నీ వాటి నిజస్వరూపంలో భద్రపరచబడి ఉన్నాయి.

('మిషా' సౌజన్యంతో)

* * *

**అంతరిక్షంలో భారరహితత్త్వంవల్ల శరీరంలో ఎముకలు నీరసిసాయి:**

అంతరిక్షంలో ప్రయాణంచేసే వ్యోమగాములు అనుభవించే తేలికతనంవల్ల శరీరంలో ఎముకలు సక్రమంగా వృద్ధిపొందకుండా నీరసించిపోతాయని, ఇది మానవుని దీర్ఘకాలపు అంతరిక్ష ప్రయాణాలకు తీవ్ర సమస్యగా పరిణమిస్తుందని నాష్‌విల్లీలో వాండెర్‌బిల్ట్ యూనివర్శిటీకి చెందిన ప్రఖ్యాత అమెరికా ఆర్థోపెడిక్ వైద్యుడు డా॥ డాన్‌స్పెంగ్లెర్ వివరిస్తున్నారు. 1973 వ సం.రం స్కైలాబ్‌లో ప్రయాణం

## భారతీయ రైల్వేల రాకపోకలు రవాణా



భారతీయ రైళ్ళమీద రాకపోకలు, సరకుల రవాణాకు ప్యాసింజర్ గూడ్సుబళ్ళలో 80 శాతానికి పైబడి డీసెల్, ఎలక్ట్రిక్ ఇంజనులు ఉపయోగిస్తున్నారు. 1950_51 వ సం.లో మొత్తం 8,209 ఇంజనులలో 8,120 స్టీము ఇంజనులు, 17 డీసెల్ ఇంజనులు, 72 ఎలక్ట్రికల్ ఇంజనులు.

"ఆత్మ సాక్షాత్కారం తొందరగా కలుగజేసే శ్రద్ధ, జాగ్రతలు వైరాగ్యాన్నిస్తాయి."

చేసిన అమెరికా వ్యోమగాములమీద చేసిన పరిశోధనలవల్ల, సోవియెట్ కృత్రిమగ్రహం "కాస్మాస్ 936" లో ప్రయాణం చేసిన ఎలుకలమీద సలిపిన పరిశోధనలవల్ల దీన్ని నిర్ణయించాడు.

* * *

## కావలూరు దూరదర్శినితో ఏ నక్షత్రమైనా కచ్చితంగా చూడవచ్చు:



కావలూరు అబ్జర్వేటరి

తమిళనాడు కావలూరు నక్షత్రపరిశోధకశాలలో ఏర్పాటైన 110 టన్నుల దూరదర్శిని (దీంట్లో కటకం బరువు 4.5 టన్నులు) కంప్యూటర్‌తో నియంత్రించబడుతుంది. దీని సహాయంతో ఆకాశవీధిలో ఏ నక్షత్రాన్నైనా 'సూదిమొన' కచ్చితంగా పరిశీలించడానికి వీలుంటుంది. ఈ దూరదర్శిని కీర్తిశేషుడు డా. ఎన్. కె. వి. బప్పు అపూర్వ వైజ్ఞానిక సృష్టి.

* * *

## ఫిల్మ్ డివిజన్ ఫిల్మ్‌కి జెక్ అవార్డు:

జెకోస్లేవేకియాలో జరిగిన 13 వ ఫిల్మ్ మరియు టెలివిజన్ ప్రోగ్రాముల అంతర్జాతీయ ఉత్సవంలో పరిసర వాతావరణం (environment) అనే విషయం మీద ఫిల్మ్ డివిజన్‌వారి "పవర్ టు ది పీపుల్" అనే ఫిల్మ్‌కి అవార్డు లభించింది. ఒక సాంఘిక మార్పు కోసం వైజ్ఞానిక దృక్పథం అనుసరించాలనే ప్రజల ఉద్యమం ఇందులో ప్రదర్శింపబడింది.

* * *

## 7వ అంతస్తునుండి పడిన 7 సం ల బాలుడు రక్షింపబడ్డాడు:

సోవియెట్ యూనియన్‌కు ఉత్తరంగా ఆర్ఖాన్‌జెలెస్క్ (Arkhangelsk) అనే నగరంలో క్రీడలను నేర్పే మాస్టరు ఎ. బోరిజిన్ రోడ్డుమీద నడుస్తూండగా 7 వ అంతస్తు మేడ కిటికీలో నుంచి క్రిందికి పడుతూన్న బాలుని చూసాడు. వెంటనే ఆ బాలుడు ఎక్కడ పడతాడో నిర్ణయించుకుని అక్కడ నిలిచి బాలుణ్ణి అమాంతం చేతులతో పట్టుకున్నాడు.

* * *

## మొట్టమొదటి ఎడారి ఔషధ పరిశోధక కేంద్రం:

రాజస్థాన్ ప్రభుత్వము మరియు జోధ్‌పూర్ ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చి సమిష్టిగా చేరి భారతదేశంలో మొట్టమొదటి ఎడారి ఔషధ పరిశోధక కేంద్రం స్థాపించారు. ఎడారి ప్రదేశాలలో ఆరోగ్య సమస్యలు, ఎడారి ప్రదేశాలలో కాలువల ద్వారా నీటిపారుదల సౌకర్యాలు మొదలైన విషయాలను కేంద్రప్రభుత్వం పరిశీలిస్తుంది.

"సులభంగా స్వల్ప ప్రయాసతో మోక్షం
దొరికితే దానికి మహత్వముండదు."

# ఆల్‌బట్రాస్ సముద్రపు పక్షి

ఆర్. ఎల్. ఖన్నా

విహంగ ప్రపంచంలో మనకి ఎంతో అద్భుతంగా ఆశ్చర్యంగా వింత కలిగించేది ఆల్‌బట్రాస్ పక్షి. పసిఫిక్ సముద్రం మీద, దక్షిణ మహాసముద్రాల మీద నివసించే సముద్ర పక్షుల కుటుంబానికి చెందినవే ఆల్‌బట్రాస్ పక్షులు. మొత్తంమీద 285 సముద్రపు పక్షులు, 12 రకాల ఆల్‌బట్రాసులు ఉన్నాయి. వీటిలో చాలా పెద్దవిగా ఉండి ఒకచోట నుండి మరో చోటుకి సదా ప్రయాణం చేసే ఆల్‌బట్రాసులు - ఆల్‌బట్రాస్ సంచారపక్షులు.



ప్రపంచంలో ఇతర పక్షులు అన్నిటికంటె ఈ సంచారపు ఆల్‌బట్రాస్ పక్షికి రెక్కలు చాలా నిడివిగా ఉంటాయి. రెక్కలు ఈ కొసనుంచి ఆ కొసకు సుమారు 12 అ. నిడివి ఉంటుంది. గంటల కొద్దీ ఆకాశంలో గాలి ప్రవాహంతోపాటు తేలిపోతూంటే ఈ పక్షులు ఎంతో అద్భుతంగా కనిపిస్తాయి. దీని బరువు 17 పౌండ్లు మాత్రమే.

ఆల్‌బట్రాస్ పక్షులకి సర్వసాధారణంగా సముద్రపు నీటిపైన దొరికే చిన్న చిన్న చేపలు, ఇతర ప్రాణులు (plankton) ముఖ్యాహారం. సముద్రపు నీటిని త్రాగడానికి ఇవి అలవాటు పడిపోయాయి. దీర్ఘకాలం పాటు ఆహారం లేకుండా కూడా ఇవి సంచరిస్తాయి. అనేక రోజుల తరబడి ఇవి నిద్రపోవు కూడా.

ఆల్‌బట్రాస్ పక్షులు జత కూడడానికి మాత్రమే సముద్రపు గట్లమీద చేరుతుంటాయి. వీటిలో ఏకపత్నీ వ్రతం కనిపిస్తుంది. ఒక మగ పక్షికి ఒకే ఆడపక్షితోను, ఒక ఆడపక్షికి ఒకే మగ పక్షితోను సంబంధం ఉంటుంది. మగపక్షులు చాలా ఆదర్శవంతమైనవి. గూడు కట్టుకోడంలో, గ్రుడ్లను పొదగడంలో, చిన్న పక్షులను పెంచ

## ముఖచిత్ర వ్యాఖ్య

(మార్చి 1987)

"భావి పౌరుణ్ణని మురిసిపోకు
బాధ్యత లున్నాయని మరచిపోకు."
— ఎన్.ఎస్. ప్రకాష్, కొడిమియాల్.

* * *

"హే భగవాన్: మానవత్వమే
ఘతమనే 'మరో ప్రపంచాన్ని'
సృష్టించు!
—బమిడిపాటి అప్పల నరసింహులు,
నరసన్నపేట.

"ముద్దులొలికే నేటి చిట్టిపాప
భావి భారత 'నవశక' నిర్మాత!
—సి. హెచ్. ధనంజయ, బినోలా.

"ఆత్మజ్ఞానము మోక్షమునకు దగ్గరి దారి."

డంలో మగపక్షి ఆడపక్షితో సరిసమానమైన బాధ్యతలు వహిస్తుంది. వాటి దాంపత్య జీవితం అత్యంత అన్యోన్యమైనది. ఈ పక్షులలో ప్రణయకలాపాలు, ప్రేమ ప్రదర్శనలు, పరస్పర మర్యాదలు ఎంతో ముచ్చటగా ఉంటాయి. ఇవి జతకూడిన తరువాత గ్రుడ్లను పొదిగే దాకా ఈ పరస్పర మర్యాదలు కొనసాగుతూనే ఉంటాయి. వింత వింత నృత్యాలతో, ప్రణయ కలహాలతో కేరింతలతో పరస్పరం ప్రేమను ప్రదర్శించు కుంటాయి.

సముద్రప్రదేశాల మీదుగా ఆల్‌బట్రాసులు అతి నైపుణ్యంగా ఎగురుతాయి. సముద్రం మీదుగా వేలకొద్ది మైళ్ళు నెలల తరబడి ప్రయాణంచేసి దక్షిణ మహాసముద్రం మీదుగా ఒక ప్రదేశాన్నుంచి మరో ప్రదేశానికి చేరతాయి. ఈ ఆల్‌బట్రాస్ పక్షులు గాలివానను, తుఫానును సూచిస్తాయి అని నావికుల మూఢనమ్మకం. గాలిలో ఎగరడానికి వాటికి గాలే ముఖ్య ఆధారం. గాలి లేకపోతే ఇవి నిరాధారంగా ఉంటాయి! ఇవి ఎప్పుడైనా క్రిందికి దిగి సముద్రంలో ఓడ మీదగానీ, నావమీద గానీ దిగితే చాలా అందవికారంగా కనిపిస్తాయి. ఇవి తిరిగి పైకి ఎగురలేవు. దీన్ని గూనీ (Gooney), మోలీ మాక్ (Molly Mawk) - మొద్దుపక్షి, దద్దమ్మ పక్షి అంటారు.

గాలిప్రవాహంతో పాటు ఇవి గంటకు 100 మైళ్ళ వేగంతో ఎగురుతాయి. నిత్య సంచారం చేసే ఆల్‌బట్రాస్ పక్షులు సదా ఎగురుతూంటాయి. జతకట్టి గ్రుడ్లుపెట్టడానికి మాత్రం భూమి మీదికి దిగుతూంటాయి. వీటికి నిద్రాహారాలు సముద్రంమీదే. నిత్యసంచారం చేసే ఆల్‌బట్రాస్ పక్షులవంటి విమానాలను అభివృద్ధి చేయడానికి మానవునికి ఇంకా ఎన్ని సంవత్సరాలు పడుతుందో!

## ప్రపంచ జనాభాలో 20 శాతం యువత



ప్రపంచం మొత్తం జనాభాలో 20 శాతం 15 మొదలు 24 సం.ల ప్రాయంగల యువకులు, యువతులు సుమారు 940 మిలియను మంది ఉన్నారు. వీరిలో 80 శాతం అంటే సుమారు 740 మిలియను మంది అభివృద్ధి పొందుతూన్న వర్థమాన దేశాలలో ఉన్నారు. వీరిలో చాలామంది గ్రామీణులు. ఇప్పుడు నగరాలకు చేరుకుంటున్నారు. ఈ విధంగా ఈ పరిస్థితులు ఇంకా కొంతకాలంపాటు కొనసాగితే 2000 సం. నాటికి నగరాలలో ఉండే యువకుల సంఖ్య ఆఫ్రికాలో 364 శాతం, ఆసియాలో 233 శాతం, లాటిన్ అమెరికాలో 160 శాతం పెరుగుతుంది.

"ముందుచూపుగల మహానుభావులు - లోకాన్ని మంచిబాటలో నడిపించడానికి ప్రయత్నిస్తారు."

# ఇవ్వడంలో నేర్పు

'పాత్రమెరిగి దానం చేయమన్నారు' నిజమే కాని పరమాత్ముడు ప్రసాదించిన అమూల్యమైన దివ్య జీవితాన్ని ఇతరులతో పంచుకుంటూ అనుభవించవలసిన బాధ్యత మన అందరికీ ఉంది. సమర్పణా చాతుర్యం సంకుచితమైనది కాదు. అతి విస్తారంగా పొంగిపొరలే అఖండ జీవిత ప్రవాహంలో సమర్పణా చాతుర్యం ప్రతిస్పందిస్తుంది.



ముఖ్యంగా 'నిన్ను నీవు సమర్పించుకోడమే' ఆత్మ సమర్పణ. "ఎవరి మనస్సులో యోచనలు వారి స్వభావాన్ని, నైజాన్ని ప్రతిబింబిస్తాయి" అని జర్మనీ దేశపు సుప్రసిద్ధ తత్వశాస్త్రజ్ఞుడు మాటర్ లింక్ చెప్పాడు.

నీవు ఇవ్వగలిగే మానసిక సహాయం కంటే ఇచ్చే వస్తువాహనాలు ఏమాత్రం అమూల్యమైనవి కావు. "వజ్రాల ఉంగరాలు, రత్నాల పేర్లు, సువర్ణ ఆభరణాలు బహుమానాలు కావు. ఇవి అసలైన వాస్తవిక బహుమానాలకు ప్రత్యామ్నాయమైన క్షమాపణలు మాత్రమే. నిన్ను నీవు సమర్పించుకునే ఆత్మసమర్పణే వాస్తవమైన బహుమానం" అన్నాడు ఎమర్సన్.

ప్రేమతో, అనురాగంతో, సంతోషంతో, కనికరంతో ఎదుటివారి భావాలను గ్రహిస్తూ దయాదాక్షిణ్యాలతో, సహనంతో, ఓర్పుతో, మన్ననలతో, క్షమాపణలతో హృదయపూర్వకంగా నీ హృదయాన్ని ఇచ్చుకుంటే ఆత్మసమర్పణ చేసుకున్న వాడవు అవుతావు.

## క్రింది హిమాలయా ప్రదేశాలలో 'గొయిటర్' రోగం బాగా పాకిపోయింది

జమ్ము-కాశ్మీర్ నుండి అరుణాచల ప్రదేశ్ వరకూ గల క్రింది హిమాలయ ప్రదేశంలో అధికంగా చెవిటివారు, మూగవారు, మానసికాభివృద్ధి లేనివారు పుట్టుకు వస్తున్నారు. ఇంతేగాకుండా, ఇక్కడ నివసించే 50 మిలియను మందిలో 20 మొదలు 70 శాతం మంది అయోడిన్ లోపంవల్ల సంభవించే గొయిటర్ గొంతు రోగంతో బాధ పడుతున్నారు. సాధారణంగా అయొడిన్ చేర్చబడిన ఉప్పు ఉపయోగిస్తే తగ్గిపోవలసిన ఈ రోగం లొంగడంలేదు.

"ఎదుటివాని ముఖ కవళికలను బట్టి, చేష్టలను బట్టి,
హృదయమర్మాన్ని బట్టి తాను దొరకకుండా మాట్లాడటం సంవాద శిల్పం."

సద్భావాలతో, సదభిప్రాయాలతో, సౌభాగ్యంతో, సదుద్దేశాలతో, సత్సంకల్పాలతో, దివ్యాదర్శాలతో, దివ్య లక్ష్యాలతో, ధర్మ తత్త్వాలతో, ప్రణాళికలతో, యోజనలతో మనస్సును ఇచ్చుకుంటే ఆత్మ సమర్పణ చేసుకున్నవాడవు అవుతావు.

దివ్య ప్రార్థనతో, దివ్య దర్శనంతో, సత్యంతో, సౌందర్యంతో, సౌకుమార్యంతో సొగసుగా ఆశలను, ఆశయాలను, అభిలాషలను.కోరికలను శాంతియుత సామరస్యంతో, పరిపూర్ణ విశ్వాసంతో ఆత్మను ఇచ్చుకుంటే ఆత్మసమర్పణ చేసుకున్న వాడవు అవుతావు.

సదా ఇతరుల ప్రగతి పథానికి ప్రాధేయపడుతూ వారి జీవిత సౌభాగ్యానికి అనుకూలించేటట్టు కాలాన్ని వినియోగించుకుంటే ఆత్మసమర్పణ చేసుకున్న వాడవు అవుతావు.

ధైర్యోత్సాహాలు కలిగించే ప్రోత్సాహాలతో, ప్రేరణలతో మృదు మధురంగా మెత్తని మాటలు చెబితే ఆత్మ సమర్పణ చేసుకున్నవాడవు అవుతావు. దివ్యతేజోమయమైన సూర్యకాంతితో సమానమైన ఉజ్వల ప్రకాశంతో ఆత్మసమర్పణ కావించుకో.

సాముదాయిక సమాజానికి ఒక సత్పురుషుని సమర్పించుకోవాలి. ఒక గృహిణికి ఆదర్శవంతమైన భర్తను, ఒక ఇంటికి ప్రేమానురాగాలతో కూడిన తండ్రిని సమర్పించుకోవాలి. దేశభక్తితో, దేశ ఉజ్జ్వల సౌభాగ్యానికి సహకరించే పౌరుణ్ణి దేశానికి సమర్పించుకో.

సృష్టి ప్రవర్తక మార్గంలో జీవిత పరమావధిని పొందడానికి ప్రపంచానికి ఆత్మ సమర్పణ కావించుకో. నిర్మాణాత్మకం, సృజనాత్మకం అయిన జీవితాన్ని ధారపోసుకోడం ఉత్తమోత్తమమైన ఆత్మసమర్పణ.

## అపూర్వ విషయాలు

### సూర్యగోళం చుట్టూ భూకక్ష్య



సూర్యగోళం చుట్టూ భూమి కక్ష్య చుట్టుకొలత 580,000,000 మైళ్ళు. భూమి ఈ కక్ష్యను సుమారు 365 రోజులలో ముగిస్తుంది. దీన్నిబట్టి లెక్క కడితే భూమి గంటకు 66,250 మైళ్ళ సగటు వేగంతో తిరుగుతుంది!

### బాతులకు పారదర్శకమైన సన్నని పొర

బీవెర్‌లకు గొంతుకలోను చెవులలోను ప్రత్యేక కవాటాలున్నాయి. నీటిలో మునిగినప్పుడు ఈ కవాటాలు వాటంతటవే మూసుకుంటాయి. తిరిగి పైకి వచ్చినప్పుడు తెరుచుకుంటాయి. బాతులకు కళ్ళు సన్నని పారదర్శక పొరలతో కప్పబడి ఉంటాయి.

"మనుష్యుని భౌతిక శరీరం పోయినా కీర్తి శరీరం ఉంటే ఆ శరీరంతో జీవించే ఉంటాడు."

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు.)

1. పి. శ్రీరామచంద్ర మూర్తి, బి.కామ్., ఇం. నెం. 9-9-46, రైలుపేట, గుంటూరు-522 001.

స్టాంపుల సేకరణ, ప్రకృతి ఆరాధన, కలం స్నేహం.

2 జి. ఎస్ రాజు, బి ఏ. 23 సం.లు; పూనూరివారి వీధి బాపినునగర్, విజయవాడ-520 016.

క్రికెట్, సినీమాలు చూడటం, విజ్ఞాన దాయకమైన పుస్తకాలు చదవటం.

3. విప్పర్తి విక్టర్ శ్యాం బాబు, ఇంటర్. S/o బంగార్రాజు, పిప్పర, తాడేపల్లిగూడెం తాలూకా. (ప. గో. జిల్లా) 534 197.

ఫోటోగ్రఫ్, ప్రకృతి ఆరాధన.

4. కె. బ్రహ్మానందం, బి ఏ (ఆనర్స్), S/o కె. వీరాచారి, శంకరపూర్ వీధి, బెర్హాంపూర్, (ఒరిస్సా) 760 006.

ప్రకృతి ఆరాధన, చిత్రలేఖనం, ఆధ్యాత్మిక చింతనం.

5. ఏ వి.వి రమణమూర్తి, బి ఎస్ సి (రెండవ సంవత్సరం); 19 సం.లు; S/o కృష్ణమూర్తి, పాకివలస గ్రామం, కోటబొమ్మాలి పోస్టు (శ్రీకాకుళం జిల్లా) 532 195.

నాణెముల సేకరణ, పుస్తకాలు చదవటం, పాటలు వినటం.

6. మువ్వా వెంకటకృష్ణ, బి కామ్. [మొదటి సంవత్సరం], జవహర్ భారత్ కాలేజి, కావలి 524 202.

కథలు చదవడం, చదరంగం ఆడటం.

## ప్రపంచంలో మిక్కిలి ఉన్నతమైన వృక్షం



కాలిఫోర్నియాలోని 'రెడ్‌వుడ్' వృక్షం ప్రపంచంలో మిక్కిలి ఉన్నతమైన వృక్షం అని అమెరికా నేషనల్ జియోగ్రఫిక్ సొసైటీలో సీనియర్ ప్రకృతి శాస్త్రజ్ఞుడు డా. పాల్ ఎ. జాహల్ కనుగొన్నాడు. ఈ రెడ్‌వుడ్ వృక్షం 367 అ. 8 అం. ల ఎత్తుగా 44 అడుగుల కైవారం కలిగి భూమి మట్టానికి సుమారు 4 అ. ల ఎత్తుగా ఉంది. 1,000 సం.లు పైబడిన ఈ ముసలిచెట్టు కాలిఫోర్నియాలో హమ్‌బోల్డ్ కౌంటీలో రెడ్‌వుడ్ క్రీక్‌కు తూర్పుగా ఉంది.

"పరబ్రహ్మమే జీవుడు, జీవుడే పరబ్రహ్మము, వీటి ఐక్యతను తెలిసికొనువాడు ఆత్మను తెలిసికొన్నట్లే."

# ఆరోగ్యానికి నిమ్మ ప్రాధాన్యత

సుజాత

నిమ్మ సిట్రస్ కుటుంబానికి చెందినది. ఈ సిట్రస్ జాతికి చెందిన నిమ్మ, నారింజ, దబ్బ, బత్తాయి మొదలైనవాటిలో ఎస్కార్బిక్ ఆసిడ్ (Ascorbic Acid) అనబడే విటమిను 'C' చాలా అధికంగా లభిస్తుంది. శరీరంలో అనుసంధాన కణాలు (కనక్టివ్ టిష్యూలు) ప్రవృద్ధికి, పోషణకి విటమిను 'C' అవసరం. ట్రిలియనులకొద్ది సూక్ష్మ కణాలతో ఏర్పడిన శరీరానికి రూపాన్నిఇచ్చి పొందికపరచే అనుసంధాన కణాలను కొలోజెన్ (Collagen) అంటారు. విటమిను



'C' లోపంవల్ల శరీరంలో కొలోజెన్ క్షీణించి పోతుంది. దీనివల్ల శరీరంలో సూక్ష్మజీవులు (Bacteria), ఇతర విష క్రిములు (Virus) సులభంగా ప్రవేశిస్తాయి. తగినంత ప్రమాణాలలో విటమిను 'C' మన శరీరంలో ఉంటే బయటి సూక్ష్మజీవులను శరీరంలోకి ప్రవేశించనీయకుండా నిరోధిస్తుంది. సక్రమంగా మోతాదుగా ప్రతి రోజు నిమ్మకాయ ఉపయోగించడంవల్ల శరీరంలో విటమిను 'C' స్థాయి నిలకడగా ఉంటుంది.

ఒక ఔన్సు నిమ్మరసంలో లభించే పోషకాంశాలు:

| | |
|---|---|
| మాంసకృత్తులు | 1.5 మి.గ్రా |
| క్రొవ్వు పదార్థాలు | 1 మి.గ్రా |
| కార్బో హైడ్రేటులు | 10.6 మి.గ్రా |

ఇంతేగాక ఇది 17 క్యాలరీల విలువకు సరిపోయిన శక్తిని కూడా కలిగిస్తుంది. 100 గ్రా.ల నిమ్మరసంలో:

| | |
|---|---|
| విటమిను A | 26 మి.గ్రా, |
| విటమిను B | 0.1 మి.గ్రా, |
| విటమిను C | 63 మి.గ్రా లభిస్తాయి. |

రక్తశుద్ధికి నిమ్మ చాలా ఉపయోగకరమైనది. విటమిను 'C' అత్యధికంగా ఉండటంవల్ల నోటిలో చిగుళ్లు, దంతాలు, శరీరంలో ఎముకలు గట్టిపడతాయి. నిజానికి పళ్లు శుభ్రం చేసుకోడానికి టూత్‌పేస్ట్‌కు బదులుగా నిమ్మను ఉపయోగించవచ్చు. ఇతర రసాయనిక పదార్థాలు లేవు కాబట్టి ఇది ఎంతో ఆరోగ్యదాయకం. ముఖ వర్చస్సుకి, శరీర ఛ్ఛాయ అభివృద్ధికి నిమ్మరసం

## దక్షిణ ధృవం దగ్గర మొట్టమొదటి వలస

దక్షిణ ధృవం దగ్గర మొట్టమొదట తొమ్మిదిమంది నావికులు, 9 మంది విజ్ఞాన శాస్త్రజ్ఞులు చేరిన 16 అమెరికనుల బృందం ఒకటి 1957 లో వలస ఏర్పరచారు.

"పాతలోని రోతను పాతిపెట్టి, మంచిని స్వీకరించి, వర్తమానాన్ని ఆకళించుకుంటూ, భవిష్యత్తులోకి ప్రవేశించడం మానవధర్మం."

చాలా సహకరిస్తుంది. చర్మానికి పరిపోషణ కలిగించి నిగారింపును కలిగిస్తుంది. నిమ్మ రసం పట్టిస్తే ముఖంమీద లేచే మొటిమలు, కాయలు పోతాయి.

చర్మ రోగాలకు ప్రతిరోజూ నిమ్మరసం మర్దన చేయాలి. నిమ్మరసంలో కొబ్బరి మానె, తులసి ఆకుల రసం కలిపిన మిశ్ర మాన్ని పట్టిస్తే దురదలు, గజ్జి మొదలైనవి నివారింపబడతాయి.

అజీర్ణ రోగాలకు, మలబద్ధతకు ప్రతి రోజూ ఉదయం, రాత్రి వెచ్చని నీటిలో నిమ్మరసం కలిపి వారం రోజులు పుచ్చుకో వాలి. ఈ మిశ్రమం తీసుకున్న 3 గంటలకు ఆహారం కొంచెంగా పుచ్చుకోవాలి. జఠర కోశంలో ఆమ్లత్వాన్ని తగ్గిస్తుంది. జఠర కోశం చురుకుగా పనిచేస్తుంది.

కడుపు నొప్పులకు ఇతర పరిణామ శూలా లకు నిమ్మరసం శీఘ్రనివారణను కలి గిస్తుంది. ఉపవాసంచేసే సమయాలలో కూడా నిమ్మరసం తరచు తీసుకుంటుండాలి. ఆహారం తీసుకోకుండా వేడినీటిలో నిమ్మ రసం కలిపి పుచ్చుకుంటే జలుబు వెంటనే నిమ్మళిస్తుంది.

పుష్టికరమైన నిమ్మరసంతో శరీర భారాన్ని తగ్గించుకోవచ్చు. నిమ్మరసంలో వేడినీరు, తేనె కలిపి తరచు తీసుకుంటే లావు తగ్గి సన్నబడతారు. దీంతోబాటు పళ్ళు, పచ్చికూరలు ఉపయోగించడం మంచిది. క్రొవ్వు పదార్థాలు అధికంగా లభించే అన్నము. పప్పు, బంగాళా దుంపలు, పాలు మొదలైనవి వాడకూడదు.

అనేక రకాల పుండ్లను మాన్పుటకు కూడా నిమ్మరసం ఉపయోగిస్తారు. ప్రాచీన చైనాలో నిమ్మకాయలు ఊరబెట్టిన ఉప్పు నీటిని పుండ్లకు పట్టించేవారు. వైజ్ఞానిక శాస్త్రప్రకారం శరీరంలో కొల్లోజెన్ ప్రవృద్ధికి ముఖ్యంగా విటమిను 'C' ఆవశ్యక మైనది.

## ఈ శతాబ్దంలో సాధించిన సాధనలు

### రాకపోకలు, ప్రయాణము, వాణిజ్యము



1903 ఫోర్డు ఉత్పత్తిని ప్రారంభించాడు.

1914 పనామా కాలువ ప్రారంభం.

1916 అన్ని వాతావరణాలలోను సముద్రంలో ఓడలకు ఎలక్ట్రానిక్ బేకనుల సౌకర్యం.

1965 కంటైనర్ పడవలకు పూర్తిగా ముందుగానే తయారైన ట్రక్ ట్రెయిన్ కంటైనర్ ప్రారంభమైంది.

1981 అంతకు ముందు జపాన్ బుల్లెట్ రైళ్ళ వేగాన్ని అధిగమించి గంటకు 235 మైళ్ళ వేగంతో ఫ్రాన్స్‌వారి ట్రెయిన్ గ్రాండె విటిస్సే ప్రపంచంలో వేగవంత మైన ట్రెయిను అని అనిపించుకుంది.

"మనిషికీ, మనిషికీ మధ్య ఉన్న అడ్డుగోడలు ఎంతో కృతకమైనవి."

# ధూమపానానికి నాశికాచ్ఛేదన

చట్ట విరుద్ధంగా పొగత్రాగే వారికి మూడు శతాబ్దాలకు పూర్వం తీవ్రమైన శిక్ష విధించే వారు. 17వ శతాబ్దంలో టర్కీ మురాద్ (Murad the cruel) పొగ త్రాగే వారిని చంపేస్తానని బెదిరించేవాడు. ధూమపానం చేసే వేలాది మందికి మరణ దండన విధించాడు, వికలాంగులను కావించాడు. వారి ఆస్తిపాస్తులను స్వాధీనం చేసుకున్నాడు. అక్కడి 'ధూమపాన శాల' లను దహించే శాడు. రాత్రిళ్ళు మారువేషంలో నగరంలో



విహరిస్తూ చట్టాన్ని పాటిస్తున్నారా లేదా అవి స్వయంగా పరిశీలించేవాడు.

జర్మనీ ఇంకా ఐక్యం కానప్పుడు అక్కడ కొన్ని స్వాతంత్ర్య రాష్ట్రాలలో కావలి వాళ్ళు పారా తిరుగుతూ పొగత్రాగే వారికి ఎక్కడి కక్కడే రోడ్డు మీదే జరిమానా విధించి వసూలు చేసేవారు. అబిసీనియా (ఇథియోపియా) లో ధూమపానం చేసేవారికి ముక్కు తెగకోయడమే శిక్ష. కాని ఈ నేరానికి ఇప్పుడు ఏ శిక్ష లేదు.

1615లో పర్షియన్ చట్టంప్రకారం పొగ త్రాగిన వారిని బలవంతంగా ఒంటెల పేడను కాల్పించి ఆ పొగను పీల్పించేవారు. కొన్ని సంవత్సరాల తర్వాత పొగ త్రాగే వాళ్ళ నోట్లో సీసం కరిగించి పోసేవారు. రష్యా జారుల కాలంలో పొగ త్రాగేవారి ముక్కులను, పెదిమలను కత్తితో చీల్చేసేవారు.

సుమారు 300 సం. ల క్రిందట జపానులో ఎవరైనా పొగ తాగుతున్న నేరం మోపి ఋజువు చేసిన వారికి నేరస్థుని ఆస్తిని సంక్రమింపజేసేవారు. ఈ శిక్షకు లొంగక పోతే చీకటి కొట్టులో పడేసేవారు.

ఈ విషయంలో బ్రిటిషు వారు ఇంత కఠినంగా ప్రవర్తించలేదు. వెల్లింగ్‌డన్ డ్యూక్ ప్రభువు హోటళ్ళలో పొగ కాల్చకూడదని ఆదేశించాడు. విక్టోరియా మహారాణి అతిథులు పొగ కాల్చకూడదని ఆదేశించింది. కొంత మంది రహస్యంగా పొగగొట్టాల దగ్గిర దొంగచాటుగా పొగ కాలుస్తుండేవారు.

## స్థిర ఆస్తులకు బిర్లాది ప్రథమ స్థానం

1984వ సం.రం లెక్కల ప్రకారం భారతదేశంలో మొదటి పది పెద్ద పారిశ్రామిక సంస్థలలో రూ. 3.359 04 కోట్ల విలువగల ఆస్థులతో బిర్లావారు ప్రథమస్థానం పొందగా టాటా రూ. 3,120.13 కోట్లతో ద్వితీయ స్థానాన్ని, షింగానియా గ్రూపు రూ. 858.37 కోట్లతో తృతీయస్థానాన్ని ఆక్రమిస్తున్నారు.

"దురాశ దుఃఖమునకు చేటు."

# జపాను నుంచి నేర్చుకోవలసిన పాఠాలు

**1930** సం. ప్రాంతంలో జపాను ఒక పేద దేశంగా ఉండేది. అటువంటి జపానుదేశం ఈనాడు మొత్తం జాతీయ ఉత్పాదన దృష్ట్యా మిక్కిలి ఎక్కువ సౌభాగ్యవంతమైన దేశాలలో మూడవ స్థానాన్ని ఆక్రమిస్తూంది. ఇతోధిక ఉత్పాదనా నైపుణ్యమే వీరి విజయ రహస్యం. జపాను దేశీయులు చేపట్టే ప్రతీ ఉద్యమం అత్యంత శ్రద్ధాభక్తులతో వాస్తవమైన అభివివేకంతో కొనసాగిస్తారు.



జపాను దేశీయులు సాంఘిక చైతన్యంతో సామూహిక సహకారోద్యమాలకు ఎక్కువ ప్రాముఖ్యతను ఇస్తారు. వ్యక్తిత్వానికి ఇక్కడ తావులేదు. సంఘమే ప్రాధాన్యం. దిగ్విజయ సాధనలన్నీ సామూహికంగా సంఘం సాధించినవే. అదే విధంగా అపజయాలన్నీ సంఘానికి చెందినవే. సౌందర్యానికి, పరిశుభ్రతకు అభిలాష, అభిమానము వీరికి అధికం. హిటాచీలో ఫౌండరీ కార్మికులు తమ ఫ్యాక్టరీ ఆవరణలో రమణీయమైన పూలతోటను పెంచారు. మధ్యాహ్నంభోజన విరామసమయంలో కార్మికులు ఈ పూలతోటలను శ్రద్ధతో పోషిస్తారు. చుట్టూ కన్నులపండువుగా, హృదయ రంజకంగా పూలతోటలు లేకపోతే ఫౌండరీ ప్రతినిత్యం పొగతో, ధూళి, దుమ్ముతో, కర్ణకఠోరమైన శబ్దంతో విసుగును, చివరకు అశ్రద్ధను కలిగిస్తుంది. పరిసర పారిశుభ్రత, సొగసుతనం, సౌందర్యాభిలాష మొదలైనవి నిత్య కార్యక్రమంలో ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని కలిగిస్తాయి. వీరు ఏ సమస్యకైనా

## కొలంబస్‌కి ప్రయాణం చేద్దామనే భావన 1481 లో కలిగింది

ఫోల్ అనునతడు ఇటీవల "ది న్యూ కొలంబస్" అనే పుస్తకం వ్రాసాడు. దీని ప్రకారం సముద్ర ప్రయాణం చేసి కొత్త ఖండాలను కనుగొన్న కొలంబస్ అసలు పేరు జాన్ కొలాన్ (Juan Colon) అని, అతడు మెజార్కాలోని స్పానిష్ ద్వీపంలో పుట్టాడని, ఇతడికి తనతో ఇటలీకి తీసుకువెళ్ళిన ఒక మునిగిపోయిన ఓడ నావికుని ప్రోత్సాహంతో 1481 లో సముద్ర ప్రయాణం చేద్దామనే భావన కలిగిందని వ్రాశాడు.

"మహాత్ములకు అకారణంగా కలిగే స్తుతి నిందలు, మానావమానాలు, లాభనష్టాలు ప్రారబ్ధం."

పై పై తాత్కాలిక పరిష్కారాలతో తృప్తి పడక క్షుణ్ణంగా, తీవ్రమైన సమగ్ర పరిశీలనా దృష్టితో పరిశోధన చేస్తారు. లక్షణాలనుబట్టి అసలు రోగనిర్ణయం నిర్ధారణ చేసుకోలేక పోతే ఎంత ఉత్తమోత్తమమైన చికిత్సకైనా ఫలం ఉండదు.

తమకు తెలియవని తోచిన విషయాలను ఇతరుల నుండి తెలుసుకోడానికి వీరు సదా సంసిద్ధులుగా ఉంటారు. జపానువారి నిర్ణయ విధానం అద్వితీయమైన విధానం. ఇది ప్రత్యేక నిర్ణయ విధానానికి కారణభూతమైన సంఘ సభ్యుల ప్రతి ఒక్కరి విశ్వాసనీయమైన నిర్ణయాన్ని ఆధారం చేసుకుని ఉంటుంది. ఒక నిర్ణయానికి సంబంధించిన వ్యక్తు లందరూ ఆ నిర్ణయానికి అంకితమై ఉంటారు. మట్సుషిటా విద్యుత్ సంస్థలో సభ్యులందరూ వైశిష్ట్యానికే ప్రాధాన్యతను ఇస్తారు. విశిష్టతా నియంత్రణాధికారి కుండే అధికారం వీరికుంది.

జపానులో పెర్సనల్ మానేజ్‌మెంట్ అంటే వసతి సౌకర్యాలు, కాంటీన్ సౌక ర్యాలు వంటి సంక్షేమ కార్యకలాపాలు ఒక్కటేకాదు. ఇది ఉద్యోగస్థుల విజ్ఞానాభి వృద్ధితో, నైపుణ్యాభివృద్ధితో సామూహిక చైతన్యతతో కూడుకుని ఉంటుంది.

జపాన్ ట్రేడ్ యూనియన్ వ్యాపార సంఘాలు తమ స్వాతంత్ర్యాన్ని కాపాడు కుంటూ సంస్థకు తగిన గౌరవ మర్యాదలను కలిగిస్తారు. కార్మికుల వ్యక్తిగత శ్రేయస్సు దేశప్రగతి మీదే ఆధారపడి ఉంటుందని జపాను సాంఘిక సంస్థల అభిప్రాయం. మొత్తంమీద ఉత్పాదన లోపంవల్ల కార్మికు లకే అపకారం కలుగుతుంది అని వీరి నమ్మకం. దీక్షతో కూడిన కార్యాచరణ, అధిక ఔత్పాదికా నైపుణ్యత, విశిష్ఠతావశ్య కతలను సంఘం అభినందిస్తుంది.

## 'రాబోటు' పదం ఎలా ఏర్పడింది?



మరమనిషికి ఆంగ్లేయపదం 'రాబోటు'. జెక్ భాషలో రాబోటా (Robota) అనే పదం నుంచి ఏర్పడింది. రాబోటా అంటే 'వెట్టి చాకిరీ' (Forced Labour) అనే అర్థంలో కారెల్ కేపెక్ (Karel Capek) 1923 వ సం. లో R.U.R. అనే తన నాటకంలో ఉపయోగించాడు. మర మనుషులు ఈ నాటకంలో మనుష్యులను చంపుతారు.

"ముఖం ముడతలు పడినా హృదయం ముడతలు పడనీయకు. ఉత్సాహం వృద్ధాప్యం పొందకూడదు." —జేమ్స్ ఎ. గార్‌ఫీల్డ్

# మెచ్చుకోడానికి యోచన వద్దు

సామాన్యంగా లోకం వాంఛించే అధికారం ధనం, కీర్తి, గౌరవం జీవితంలో సమకూడితే ఎంతో అదృష్టవంతుడవని అనుకుంటావు. పొంగిపోతావు. జీవితంలో ఇటువంటి సదవకాశాలవల్ల నీ సమర్థత పెరుగుతుంది. ఇంట్లో కుటుంబ సభ్యుల ప్రేమానురాగాలు, ఆఫీసులో పనిచేసేవారి దయాదాక్షిణ్యాలు, సమాజంలో సభ్యుల సౌభ్రాతృత్వం మొదలైన వాటివల్ల నీలో అపూర్వమైన ఉత్సాహం, చొరవ బయలుదేరుతుంది. కార్యనిరతి, నైపుణ్యత, దక్షత ఏర్పడుతుంది. నీలో దాగి ఉన్న అద్భుతమైన శక్తి ప్రకటితమవుతుంది. ఇటువంటి నూతన ఉత్సాహంవల్ల, చొరవవల్ల క్రియాశక్తి అద్భుతంగా పెరిగిపోతుంది.



ప్రేమాభిమానాలను అభిలషించడం మానవనైజం. ఉన్నదానికంటే ఎక్కువ ప్రాముఖ్యతతో గౌరవంతో ఉన్నామనే భావనను కలిగించుకోడానికి మానవుడు ఇతరుల మన్ననలను, ప్రశంసలను అపేక్షిస్తాడు. ఇతరుల ప్రశంసలవల్ల, మన్ననలవల్ల తను సమాజంలో ఒక ప్రత్యేకస్థానం, గౌరవం, మర్యాద పొందగలుగుతున్నానని, పేరు ప్రఖ్యాతులు పొందుతున్నానని సంతృప్తిపడతాడు, సంబరపడతాడు. అనురాగంతో నీలో దాగి ఉన్న ప్రేమానుభూతులను ప్రవహించనీ. ఇతరుల కష్టాలను తెలుసుకో. చేయగలిగినంత సహాయం చేయి. అప్పుడే నీకు వారి ప్రేమానురాగాలు లభిస్తాయి. అప్పుడే వారి సహాయం నీకు కలుగుతుంది. అప్పుడే వారి మన్ననలు నీకు లభిస్తాయి. అప్పుడే వారి మెప్పులు నీకు లభిస్తాయి. ఎవరికి వారు తమ వ్యక్తిత్వాన్ని,

## "ప్రైమ్ మినిష్టర్" పదం ఉత్పత్తి

ఆంగ్లంలో ప్రీమియర్ లేక ప్రైమ్ మినిష్టర్ అనే పదం 1714 వ సం.లో జర్మనీలో హనోవర్‌కు చెందిన 1 వ జార్జి ఇంగ్లండు రాజైనప్పుడు ఏర్పడింది. ఇతడికి ఆంగ్ల భాష రాదు. క్యాబినెట్‌లో రాబర్ట్ వాల్‌పోల్ అనే సభ్యుడు ఇతడికి జర్మన్ భాషలోకి అనువదించి చెప్పటానికి నియోగింపబడ్డాడు. ఇతడే ఛాన్సలర్ ఆఫ్ ది ఎక్స్ చెకర్. ఇతడినే ప్రీమియర్ లేక చీఫ్ మినిష్టర్ అని పిలిచేవారు.

"పొట్టుతో ఉన్నంతవరకే ఏ విత్తనమైనా మొలకెత్తుతుంది,
అవిద్యావరణం ఉన్నంత వరకే జనన మరణాలుంటాయి."

ప్రత్యేకమైన సృజనాత్మక విధానాన్ని ప్రకటించుకోడానికి ప్రయత్నిస్తారు. వ్యక్తిత్వాన్ని ప్రకటించుకోడానికి తగిన అవకాశం కోసం ఎదురు చూస్తారు. ఇది ప్రకటించుకోలేనప్పుడు దుఃఖించి పోతాడు మానవుడు.

అందరూ సత్ఫలితాలనే కోరుకుంటారు. దుఃఖాలు ఎవరికి కావాలి? కష్టాలను ఎవరు కోరుకుంటారు? సమాజంలో తమకు గౌరవం, మర్యాద దక్కాలనుకుంటారు. ఇది మానవనైజం. ఇది దక్కనప్పుడు, లోకం వెక్కిరించినప్పుడు. నిర్లక్ష్యం చేసినప్పుడు, నిర్దయతో నిరుత్సాహం కలిగించినప్పుడు దురదృష్టవంతుడవనుకొని దిగులు పడిపోతావు. నీలో చొరవ తగ్గిపోతుంది. అసమర్థుడవు అయిపోతావు.

ఇది అనేక విధాలుగా జరుగుతుంది. అనేక రంగాలలో అనేక వృత్తులలో జరుగుతుంది. ఒక పెద్ద సంస్థలో అధికారి తన సిబ్బందిని నిరసించినప్పుడు, స్నేహితులు నిర్లక్ష్యంతో వెక్కిరించినప్పుడు నిరుత్సాహం, భయం, తక్కువతనం ఆవరించుకుపోతాయి. ఇటువంటివి సహించటం కష్టం. నిరాశతో దుస్సాహసాలకు పాల్పడవచ్చు. జాగ్రత్త:

మెచ్చుకోడానికి తటపటాయించ వద్దు. ఆక్షేపించడానికి తొందర వద్దు.

—ప్రకాష్ జె. షా.

## సూట్‌కేసులో పెట్టుకోడానికి వీలైన బుల్లి హెలికాప్టర్

సోవియెట్ రష్యాలో ముగ్గురు ఇంజనీర్లు, ఒక మనిషి మాత్రమే కూర్చోడానికి వీలయే హెలికాప్టర్‌ను తయారుచేశారు. దీని వేగం ఒక గంటకు 160 కి.మీ.లు. అవసరం లేనప్పుడు దీన్ని ఏ భాగానికా భాగం విడగొట్టి సూట్‌కేసులో పట్టుకుపోవచ్చు. అవసరమైనప్పుడు ఇట్టే బిగించుకోవచ్చు.

## చార్లీ చాప్లిన్‌కి టాకీ లంటే అమిత ద్వేషం



ప్రపంచ ప్రసిద్ధి పొందిన హాస్యనటుడు చార్లీచాప్లిన్‌కి టాకీలంటే అమిత ద్వేషం. 1927 వ సంవత్సరం నుంచి టాకీలు బాగా ప్రచారంలోకి వచ్చినా తను "టాకీ" చిత్రంలో మాట్లాడలేదు. ఇతడు మాట్లాడిన మొదటి చిత్రం 1940 లో తీసిన ది గ్రేట్ డిక్టేటర్.

"సాధించిన కొద్దీ అధికంగా సాధించగలుగుతాం,
ఉత్సాహం అధికమైన కొద్దీ అవకాశం ఎక్కువ కనిపిస్తుంది."

# వర్ధమానదేశ అల్యూమినియం వనరులు

ముఖ్యంగా ప్రయాణాలకు ఉపయోగింపబడే విమానాలకు మూటికి రెండు వంతులు మొదలు నాలుగుకి మూడువంతులు అల్యూమినియం వాడుతూంటే రాకెట్లకు 50 శాతం వాడబడుతూంది.

ఉక్కుకు బదులుగా అల్యూమినియం వాడటంవల్ల వీటి బరువు సుమారు మూడవ వంతుకు తగ్గిపోయింది. కార్బను చేరిన గట్టి ఉక్కుకంటే అల్యూమినియం పదిరెట్లు



సముద్రపు నీటికి త్రుప్పుపట్టి చెడిపోకుండా ఉంటుంది. సోవియెట్‌లో భూగర్భ రైలు సౌకర్యాలకు అల్యూమినియం మిశ్రమ లోహంతో తయారైన కారులు వాడకంలోకి వచ్చాయి. ఇవి గంటకు 100 కి.మీ. వేగాన్ని అందుకోగలవు. మాస్కో- లెనిన్‌గ్రాడ్ రైలుసంస్థ నడిపే E R 200 ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్‌కు అల్యూమినియం మిశ్రమ లోహం ఉపయోగించటంవల్ల మామూలు రైలు బండికంటే ఇది మూడవవంతు తేలికగా ఉంటుంది. అటామిక్ రియాక్టర్ల విడిభాగాల నుంచి అగ్గి మాపక దళం ధరించే దుస్తుల వరకూ సుమారు 2,000 వస్తువులు అన్నీ అల్యూమినియంతో తయారు చేయబడినవే.

అల్యూమినియం ఉత్పాదనకు ప్రాతిపదికమైన ముడిపదార్థం ఉత్తమ రకపు బాక్సైటు ఖనిజం. ప్రపంచంలో మొత్తం బాక్సైటు నిధులు 8-10 బిలియను టన్నులని అంచనా వేయబడింది. (ఇది ప్రస్తుతం సాలీనా 100 మిలియను టన్నులు త్రవ్వబడుతుంది.) ముఖ్యంగా గునియా, ఇండియా, ఇండోనేషియా, జమైకావంటి వర్ధమాన దేశాలలో అల్యూమినియం నిధులు విస్తారంగా ఉన్నాయి. ప్రపంచంలో తలసరి అల్యూమినియం వినియోగం 3 కి. గ్రా.లు. ఇది ప్రపంచపు తలసరి రాగి వినియోగం కంటే 1.5 రెట్లు అధికం.

## పాఠకుల అభిప్రాయాలు

“ఆత్మస్తుతి, పరనింద ఈ రెండూ
కలిగి ఉన్నవాడెవ్వడూ సత్పురుషుడు
కాడు. కాలేడు.”

—కోరాడ దుర్గారావు, చీపురుపల్లి.

* * *

“కులాలెన్నైనా కూటికోసమే
మతము లెన్నైనా మానవత్వం
కోసమే.”

—వి. సుబ్రహ్మణ్యంరాజు, ఏలూరు.

“జంతుకోటిలో ఆత్మదర్శన సామర్థ్యముగల మనుష్యుడు ఉత్తముడు.”

# చెవుల సంరక్షణ

మానవుని శ్రవణేంద్రియం చెవి. ఇది పై చెవి, డ్రమ్, మధ్య చెవి, లోచెవి అని నాలుగు భాగాలుగా విభజింప బడింది.

డ్రమ్‌కి హాని కలిగినప్పుడు చెవిలో తీవ్రమైన పోటు పుడుతుంది. పూర్తిగా గాని, పార్శ్వంగాగాని చెముడు కలుగుతుంది. కొద్దిగా రక్తం స్రవిస్తుంది.

చెవిలో వేసుకునే ఏ విధమైన చుక్కల మందు వాడకు. డాక్టరు దగ్గరకు వెళ్ళి



చూపించుకునే ముందు బాధ భరించలేకుండా ఉంటే నొప్పి నివారించే మాత్రలు ఒకటో రెండో వేసుకో.

కొందరి చెవులలో గులిమిచేరి గట్టిపడి పోయి చెముడు ఏర్పడవచ్చు. చెవులు భారం అనిపించినప్పుడు చెవిలో గింగురు మనే శబ్దం వినిపించినప్పుడు చెవిలో గులిమిచేరిందని నిర్ణయించుకోవచ్చు. వైద్యుడు చెవిలో హైడ్రోజన్ పెరాక్సైడు వేసి గులిమిని మెత్తపరచి ఉప్పునీటిని పిచికారి చేసి శుభ్రపరుస్తాడు.

నీ అంతట నీవు గట్టిగా పుడకతో కెలుకుతూ గులిమి తీసుకోడానికి ప్రయత్నించకు. చెవిలోపల డ్రమ్‌కి తగిలి డ్రమ్ చిరిగి పోవచ్చు. చెవిలో డ్రమ్ దెబ్బతింటే చెవిలో ఏవిధమైన మందు చుక్కలుగానీ, నూనెగానీ వాడకూడదు.

ఒక్కొక్కప్పుడు పాకుతున్న చీమలు, ఈగలు, దోమలు వంటి చిన్న చిన్న కీటకాలు చెవిలో దూరవచ్చు. ప్రకాశవంతమైన కాంతిపుంజాన్ని చెవిలోకి ప్రసరింపచేసి డ్రమ్ దెబ్బతినకుండా ఉంటే నీరు, నూనె వంటి ద్రవ పదార్థాలు వేసి కీటకాలను తేలేటట్టు చేసుకోవచ్చు.

కోసుగా ఉండే వస్తువులుగానీ ఉబ్బే వస్తువులుగానీ చెవి రంధ్రంలో చేరినప్పుడు జాగ్రత్తపడాలి. ఇది మంచి నిపుణుడైన వైద్యునిచేతే తీయించుకోవాలి. అగ్గిపుల్లలు, కోసుగా చుట్టిన కాగితం మొదలైనవి చెవిలో పెట్టుకుని దీన్ని తీసుకోవడానికి ప్రయత్నించవద్దు.

దెబ్బ తగిలినప్పుడు, సూక్ష్మజీవులకు సంబంధించిన బాక్టీరియావల్ల, అలర్జీవల్ల,

(మిగతా 50 వ పేజీలో

## మృదు పానీయాల తలసరి వినియోగం

సీసాలలో నిలువ ఉంచిన మృదుపానీయాల తలసరి వినియోగం భారతదేశంలో మూడు. ఇదే థాయ్‌లాండ్‌లో 38, ఈజిప్టులో 63, బ్రెజిల్‌లో 86.

"రుచిని గూర్చి వినియున్నవాడు అజ్ఞాని, రుచిని తెలుసుకున్నవాడు జ్ఞాని, ప్రత్యక్షంగా రుచి చూచినవాడు విజ్ఞాని."

# పట్టుదలతో ఆహారం సంపాదించుకుంటుంది

వి. ఆర్. వి. రాఘవన్

నేల గట్టిగా ఉంటే కాళ్ళతో గట్టిగా
కెక్కరిస్తుంది.
నేల పొడిగా ఉంటే ఇంకా లోతుగా
తవ్వుతుంది.
నేల తడిగా ఉంటే పొడిగా ఉన్న చోట
త్రవ్వడానికి ప్రయత్నిస్తుంది.
రాయి తగిలితే రాతి చుట్టూ తవ్వుతుంది.
పగటి కాలం మరో కొన్ని గంటలు



పెరిగితే మరి రెండు గ్రుడ్లు అధికంగా
ఇస్తుంది.
భూమిలో పురుగులను, కీటకాలను
కెక్కరించుకుంటూ ఎంతో అమూల్య
మైన లాభం కలిగించే గ్రుడ్లను పెడు
తుంది,
కోళ్ళను ఇస్తుంది.
నిరాశ పడిపోయిన కోడి ఎక్కడా కని
పించదు.
ప్రయత్నించకుండా ఆహారం నోటి
దగ్గరకు
వస్తుందని కాచుకు కూర్చునే కోడి
ఎక్కడా కనిపించదు.

భూతలం గట్టిగా ఉందని తవ్వలేక
పోతున్నానని
చిటపటలాడే కోడికనిపించదు.
నిరంతరం భూమిని త్రవ్వుతుంటాయి.
గ్రుడ్డుపెట్టడానికి
తహతహ లాడతాయి.

( 49 వ పేజీ తరువాయి)

లేక చెవిలో చలిగాలి, నీరు చేరుటవల్ల చెవి వాచిపోయి నొప్పి. పోటు పెడుతుంది. వైద్యుణ్ణి సంప్రదిస్తే శుభ్రపరచి తడి లేకుండా చేస్తాడు.

ముక్కులలో ఏదైనా అంటురోగం సంభవిస్తే ఇది మధ్య చెవికి ప్రాకవచ్చు. ఇవి సాధారణంగా నోరు మూసుకుని గట్టిగా చీదడంవల్ల, లేక ముక్కు దిబ్బదేసుకు పోయినప్పుడు ముక్కుకు సంబంధించిన అంటురోగం వల్ల, ఫ్లూ జ్వరం వల్ల, గవద బిళ్ళలవల్ల, ఆటలమ్మవల్ల ఏర్పడటానికి అవకాశముంది. చెవిలో నుంచి నీరుగానీ, చీముగానీ కారుతూందంటే చెవి భ్రమికి దెబ్బ తగిలిందనే అర్థం. డాక్టరు సలహా లేనిదే ఏ మందు చుక్కలు వాడకూడదు. చెవిలో ఏదైనా చేరినప్పుడు నీ అంతట నీవు తీసుకోడానికి ప్రయత్నించవద్దు. చెవి తీవ్రంగా పోటు పెట్టినప్పుడు చెవి సక్ర మంగా వినిపించకపోయినప్పుడు, చీము, నెత్తురు కారుతున్నప్పుడు వెంటనే ఆలస్యం చేయకుండా వైద్యుణ్ణి సంప్రదించండి.

"ధర్మార్థ కామ మోక్షాలకు సమప్రాధాన్యం
ఇచ్చి మెలగువాడే సర్వోత్తముడు."

# జాతీయవార్తలు

## వజ్రాల ఎగుమతి 67 రెట్లు పెరిగింది:



జెమ్ అండ్ జ్యూయలరీ ఎక్స్‌పోర్టు ప్రమోషన్ కౌన్సిల్ వారి సమాచారం ప్రకారం 1966-67 వ సం.లో ఉన్న రూ. 22 కోట్ల విలువగల వజ్రాల ఎగుమతి 1985-86 వ సం.లో రూ. 1,494 కోట్లకు పెరిగింది. 20 సంవత్సరాల కాలవ్యవధిలో వజ్రాల ఎగుమతి 67 రెట్లకు పైగా పెరిగింది.

## భారత దేశపు మొట్టమొదటి టెక్నాలజీ పార్కు:

ఉత్తరప్రదేశ్ సూరజ్‌పూర్‌లో సాంకేతిక వనం (technology park) ఒకటి ఏర్పాటు కాబోతుంది. భారతదేశంలో ఇటువంటిది ఇదే మొదటిది. 100 ఎకరాల వైశాల్యం గల ఈ ప్రదేశంలో ఉత్తమ స్థాయిలో సాంకేతిక సాహసికోద్యమ సంస్థలు నెలకొల్పబడతాయి.

## మొట్టమొదటి ఫైబర్ గ్లాస్ విమానం:

బెంగళూరు, నేషనల్ ఏరోనాటికల్ పరిశోధన శాలలో మొట్టమొదటి ఫైబర్‌గ్లాస్ విమానం నిర్మించబడింది. ఈ తేలిక అయిన విమానం 2,700 కి.మీ. దూరం గంటకు సుమారు 420 కి.మీ.ల వేగంతో పోగలదు.

* * *

## సైలెంట్‌వేలీ నేషనల్ పార్కుగా ప్రకటింపబడింది:



కేరళరాష్ట్రం పాల్ఘాట్ జిల్లాలో గల సైలంట్‌వేలీ రిజర్వు అడవులను కేరళ ప్రభుత్వంవారు సైలెంట్ వేలీ నేషనల్ పార్కుగా ప్రకటించారు. వృక్ష మరియు జంతు సంపద సంరక్షణకు జీవావరణ సంక్షోభ నివారణకు ఇది ఏర్పాటు కాబడింది.

"లోక సామాన్యంగా నడిచిన దారినే నడిస్తే క్షేమమని భావించడం సహజం."

# ఎందుకు?

## కొంతమంది రంగులను గుర్తింపలేరు - ఎందుకు?

ప్రతీ వందమంది జనంలోను నాలుగుమంది పురుషులకి అంతకంటే తక్కువమంది స్త్రీలకు 'కలర్ బ్లైండ్‌నెస్' వల్ల రంగుల వివరణ తెలియదు. సూర్యకాంతి పుంజము తెల్లని వస్తు తలముపై పడినప్పుడు 'అవి తెల్లగా ఉంది' అని అంటాము. ఈ కాంతి పుంజమే వర్షబిందువులు గుండా ప్రసరించినప్పుడు ఇంద్రధనుస్సుగాను, గాజుపట్టకము గుండా ప్రసరిస్తే (ఎరుపు, నారింజ వర్ణం,



పసుపు, ఆకుపచ్చ, బ్లూ, ఇండిగో, ఉదా) సప్త వర్ణాలుగా విభజింపబడుతుంది. కాంతి తరంగములుగా ప్రసరిస్తుంది. వివిధ వర్ణ కాంతులకు వివిధ పరిమాణాలు, వేగాలు ఉంటాయి. అందువల్లనే కాంతి గాజు పట్ట కము గుండా ప్రసరించినప్పుడు ఇవి విభజింపబడును.

ఈ వర్ణములలో ఏ వర్ణమునైనా మానవులు గుర్తించలేకపోవచ్చు. కాని వీటిలో ముఖ్యంగా ఎరుపు, ఆకుపచ్చల వివక్షత లేని వారిని రెడ్ బ్లైండ్, గ్రీన్ బ్లైండ్ అంటారు.

మానవుడు కంటిలో ఉన్న సూక్ష్మాతి సూక్ష్మమైన కోన్స్ సహాయంతో కంటి జ్ఞాన నాడి ఎల్ల రంగులను చూడగలుగుతున్నాడు. కొందరియందు ఈ కోనులు లోపిస్తాయి. అందువల్ల వీరికి కొన్ని రంగులు స్వచ్ఛంగా కనిపించవు. రెడ్‌బ్లైండ్ లోపం ఉన్నవారికి ఎరుపు ఆకుపచ్చలలో ఆకుపచ్చ రంగే ఎక్కువ కాంతివంతంగా కనిపిస్తుంది. గ్రీన్ బ్లైండ్ లోపం ఉన్నవారికి ఎరుపే ఎక్కువ కాంతివంతంగా కనిపిస్తుంది. ఈ రంగులే మంచుతో కప్పబడిపోయినప్పుడు ఈ రెండు రంగుల వివక్షత అసలు ఉండదు.

రైలు, మోటారు కారు, ఓడలు మొదలైన వాటి డ్రైవర్లకు ముఖ్యంగా ఎరుపు, ఆకుపచ్చ సిగ్నలుల వ్యత్యాసం బాగా తెలిసి ఉండాలి. వీరిమీదే వేలాది ప్రయాణీకుల జీవితాలు ఆధారపడి ఉంటాయి. కలర్ బ్లైండ్ లోపం ఉన్నవారికి మంచు సమయంలో రెడ్ సిగ్నల్‌కి, గ్రీన్ సిగ్నల్‌కి వ్యత్యాసం తెలియదు.

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద బ్లూ డైమండ్

ఇప్పుడు, వాషింగ్‌టన్ (అమెరికా) డి.సి.లో స్మిత్సోనియన్ (Smithsonian) సంస్థలో ఉన్న 'హోప్ డైమండ్' ప్రపంచంలో కెల్లా మిక్కిలి పెద్ద పీలిరంగు వజ్రం. ఇది భారతదేశం దక్కన్ పీఠభూమి గోలుకొండలో లభించింది.

"ప్రేమ ఉన్నప్పుడే పరిశుద్ధత ఏర్పడుతుంది.
ప్రేమ లేనప్పుడు పరిశుద్ధత లేదు."

# తెల్లతోక గరుడపక్షి

బ్రహ్మాండమైన తెల్లతల గరుడపక్షి అమెరికా రాజ్య చిహ్నం. ఫెడరల్ రిపబ్లిక్ జర్మనీకి (పశ్చిమ జర్మనీ) బంగారు గరుడ పక్షి రాజ్యచిహ్నం.

గరుడపక్షులలో అన్నిటికంటే పెద్దది ఐరోపాతీర ప్రదేశాలలో సాధారణంగా కనిపించే తెల్లతోక గరుడపక్షి. దీని రెక్కల నిడివి సుమారు 10 అడుగులు. ఈనాడు ఇది సంరక్షింపబడుతున్న పక్షి. పూర్వకాలంలో గరుడపక్షిని పక్షులకు రాజుగా గౌరవించేవారు.



సుమారు 170 సం. లకు పూర్వం మధ్య ఐరోపాలో గల అన్ని అడవులలో ఇవి ఎక్కువగా కనిపించేవి. ఇవి ఇప్పుడు అంతరించిపోతున్నాయి. మానవుడు గరుడపక్షుల గూళ్ళని నాశనం చేయడమేగాకుండా వాటికి ఆహారం దొరకకుండా చేస్తున్నాడు. గరుడ పక్షులు చాలాకాలం వరకు జతకూడవు. బంగారు గరుడపక్షులు (Golden Eagles) మానవుడిలాగే దీర్ఘకాలం జీవిస్తాయి. 80 సం. వయస్సు గల గోల్డెన్ ఈగిల్స్ (వృద్ధ గ్రద్దలు) కూడా ఉన్నాయి. ఈ గ్రద్దలు సాధారణంగా చాలా తక్కువ గ్రుడ్లను పెడతాయి. ఇవి పెరిగి పెద్దవి అవడం చాలా అరుదు. తల్లి పక్షులు వీటికి తగినంత మేతను తెచ్చిపెట్టవు.

సాధారణంగా మానవులకు కూడా దొరకకుండా భయంతో బెదిరిపోయే ఈ పక్షులను అతి సులభంగా పెంచవచ్చు. నేర్పుగా, నైపుణ్యంతో వీటిని పిలుస్తూ నాలుగైదు వారాలలో వీటిని మచ్చిక చేసుకోవచ్చు.

బాగా మచ్చిక చేసుకున్న తరువాత వీటిని అన్నిరకాల వేటలకు ఉపయోగించవచ్చు. ఇవి కుందేళ్ళు, నక్కలు మొదలైన వాటిని అతి సౌలభ్యంగా వేటాడి చంపుతాయి. క్రూరమైన తోడేళ్ళను కూడా ఇవి వేటాడుతాయి. వీటిని చంపిన తరువాత తమ యజమాని వచ్చేదాకా నిరీక్షిస్తూంటాయి.

హాకింగ్ (Hawking), ఫాల్కనీ (falcony) అనే గ్రద్దలవేట అతి ప్రాచీనమైన నాగరికతలో ఒక విలాసం.

## హాండ్ బాగ్‌లో ఇమిడే మిక్కిలి చిన్న అలారం

పశ్చిమ జర్మనీలో ఒక కంపెనీ తయారు చేసిన మిక్కిలి చిన్న అలారం హాండ్ బాగ్‌లో ఇమిడిపోతుంది. చిన్న లిప్‌స్టిక్ పరిమాణంలో ఉండే ఈ సాధనానికి చేతివ్రేలు తగిలితే చాలు "కీచు"మని పెద్ద ధ్వని ఏర్పడుతుంది. దొంగలు హాండ్ బాగ్‌లు దొంగిలించేవారు భయపడి పారిపోతారు

"ఏ అంతరంలోనైనా ప్రతి క్షణంలో ఎంత ఎక్కువగా సత్యాన్ని తెలుసుకోగలిగితే అంత ఎక్కువ మనశ్శాంతి లభిస్తుంది."

# బహుమతి పొందిన వ్యాసం

## సహకారం - ప్రగతి సాధకం

ఆర్.యు. రమణ, విజయవాడ.

నేటివరకు మానవజాతి సాధించిన అద్భుత విజయాలన్నీ సహకారసూత్రంమీద ఆధారపడి సాధించినవే. ఆదిమానవులు కూడా తమకున్న పరిమితులలో పరస్పరం సహకరించుకుని దానివల్ల లాభం పొందడం నేర్చుకున్నారు. ఈ పరస్పర సహకారం క్రమక్రమంగా వివిధ రంగాలకు విస్తరించి నేటి నాగరికత స్థాయికి చేరుకుంది. మానవుడు చంద్రమండలంపై కాలు మోపగలిగాడంటే కారణం పరస్పర సహకారమే. ఒక శాస్త్రవేత్త తాను కనుగొన్న విషయాలను, వేరొక శాస్త్రవేత్త కనుగొన్న విషయాలను క్రోడీకరించి మరింత సులువైన మార్గాన్ని అన్వేషించడమే వాస్తవమైన విజయమని చెప్పవచ్చు. భారతదేశం వంటి అభివృద్ధి చెందుతూన్న దేశాలు ఆర్థిక రంగంలో కానీ, సాంకేతిక రంగంలో గానీ, మరే ఇతర రంగాలలో గానీ అభివృద్ధి సాధించాలంటే అభివృద్ధి చెందిన దేశాల సహకారం సామభూతి పొందడం అవసరం.

భారతదేశంలో అన్ని ఇనుము, ఉక్కు కర్మాగారాలు విదేశాల సాంకేతిక సహకారముతో నిర్మింపబడినవే. ఇవి భారతదేశ ఆర్థిక రంగాన్ని అభివృద్ధి చేసాయి. ఒక వ్యక్తి ఒంటరిగా ఉన్నప్పుడు సాధించలేని విజయాలెన్నో సమిష్టిగా సాధించగలుగుతాడు. ప్రతీ అద్భుత విజయం వెనుక పలువురి సహకార ప్రతిభ సంక్షిప్తమై ఉంటుంది.

అణుశక్తి, ఖగోళ శాస్త్ర విషయాలలో ఇతర దేశాల సహకార పాత్ర చిరస్మరణీయమైనది. ఈ సహకారం దేశాలకు దేశాలకు మధ్యనే గాక, వ్యక్తికి వ్యక్తికి మధ్యన కూడా మరువరానిది.

* * *

### భారతీయ రైల్వేల రికార్డు లోడింగు



పంజాబు, హర్యానా మరియు ఉత్తర ప్రదేశ్ నుండి కొరతగా ఉన్న దక్షిణ రాష్ట్రాలకు 1986 జూలైలో భారతీయ రైల్వేలు ఆహార ధాన్యాలను అత్యధికంగా రవాణా చేసారు. 1985-86 సం. లో సగటున మాసానికి 2.6 లక్షల టన్నులు రవాణా చేస్తే ఈ ఒక్క నెలలో 3.6 లక్షల టన్నులు రవాణా చేసారు.

"సాటివాని కష్టసుఖాలకు స్పందించే హృదయం కలవాడే కవి."

పి. ఆదిలక్ష్మి, గుంటూరు.

పరస్పర సహకారం మానవ జీవన ప్రగతికి ముఖ్యసూత్రం. ఈ పరస్పర సహకార సూత్రం వల్లనే నేటి ప్రపంచం బహుముఖంగా అభివృద్ధి సాధించగలిగింది. ఒక పని ఒకరే చేస్తే కష్టమనిపిస్తుంది. మరొకరు సహకరిస్తే క్షణంలో అయిపోయినట్లు అనిపిస్తుంది. సహకారంలో ఆనందం, ఉత్సాహం, ఉల్లాసం ఉంటుంది. ఒకరికి సహకరించడం అంటే మనకు మనం సహకరించుకోడమే: ఒక వ్యక్తి తాను ఇతరులకు ఏమాత్రం ఉపయోగ పడనప్పుడు ఇతరులుకూడా అతనికి సహాయం చెయ్యరు. స్వార్థం కోసమైనా సహకార గుణం కలిగి ఉండాలి.

ప్రకృతిలో సమస్త శక్తులు ఒకదానికొకటి సహకరిస్తున్నాయి. శరీర నిర్మాణంలో వివిధ అవయవాలు ఒకదానికొకటి సహకరిస్తున్నాయి. ప్రపంచానికే కాదు, దేశానికే కాదు, రాష్ట్రానికే కాదు. ఒక కుటుంబంలో సభ్యులు సుఖంగా ప్రశాంతంగా ఉండాలంటే పరస్పర సహకారం అత్యావశ్యకం. పరస్పర సహకారం సాంఘిక సంస్థకు సంపూర్ణ సరళతను ప్రసాదిస్తుంది.

సహకార లోపంవల్ల మన దేశం అనేక వందల సంవత్సరాలు పరాయి పాలనలో అనేక కష్టాలు అనుభవించవలసి వచ్చింది. పరస్పర సహకారంతో భారత దేశ స్వాతంత్ర్యం సాధించగలిగాం. సహకారమే సంఘీభావానికి మార్గం. పరస్పర సహకారం పరమ ఉదాత్తమైన ఆదర్శం.

కులమత భేదాలు, అంతస్థుల అంతరాలు మరచి తోటివారికి సహకారం అందించగలిగిన నాడు మానవ హృదయ కవాటాలు తెరచుకుంటాయి. ప్రపంచ శాంతి అనే అఖండ విజయం గోచరిసుంది.

## కీబోర్డును ఉపయోగించే రాబోట్



జపానులో తయారు కాబడిన దానంతటదే కీబోర్డును ఉపయోగించే మరమనిషి విద్యుత్ వాద్యాన్ని చేతులు కాళ్ళు ఉపయోగించి వాయించగలదు. ఇది 90 కి.గ్రా. బరువుతో 180 సెం.మీ.ల ఎత్తు ఉంటుంది. నియంత్రణ సాధనం రాబోటు కదలికలను నియంత్రిస్తుంది. కెమెరా మరియు రీడింగ్ సాధనంతో సంగీతం పాడుతుంది. స్వరసంయోగ సాధనంలో మాట్లాడుతుంది. మానవుల చేతికుండే నైపుణ్యం, నాజూకు మరమనిషి చేతి వ్రేళ్ళకు ఉంది:

"తెలుసుకో గలిగిన వ్యక్తికి తత్త్వంలో కూడా సైన్స్ గోచరిస్తుంది."

దరిశ వెంకటేశ్వరరావు, కోడూరు.

దేశ ప్రగతికి ముఖ్యమైనది సహకారం. ఆర్థిక, వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో ప్రజలు, ప్రభుత్వం సహకారంతో ఉంటే ఆర్థిక పరిస్థితులు సరళవంతంగా ఉంటాయి. ప్రజలలో స్వచ్ఛందంగా పుట్టుకు రావలసినదే సహకారోద్యమం. అప్పుడు దేశ ప్రగతికి సహకారం ప్రగతి సాధకం అవుతుంది.

మన దేశంలో సహకార రంగం ప్రజల వలన గాక ప్రభుత్వపరంగా ప్రోత్సహింపబడుతుంది. దానికి తగినంత ప్రజాదరణ లభించడం లేదు. ఈనాడు భారత దేశంలో సహకార రంగం అవినీతికి సార్థకమైపోయింది.

మనదేశంలోచాలామంది నిరక్షరాస్యులు. విద్యావంతులైనవారు, యువకులు, స్వచ్ఛంద సహకార సేవాపరులు సహకారోద్యమ వ్యాప్తికై పాటుపడాలి. ప్రజలకు సహకార విధానం యొక్క విశిష్టతను తెలియపరచి, సహకార సంస్థలను స్థాపించి స్వచ్ఛందంగా సభ్యులు చేరునట్లు చూడాలి. సన్నకారు రైతులకు సహకార విధానాలను విశదపరచి, సహకార వ్యవసాయ క్షేత్రములను స్థాపించుకొనునట్లు చూడవలెను.

సహకార విధానాలపైన ముఖ్యంగా ప్రభుత్వ రంగంలో కూడా భారీ మార్పులు రావలెను నిపుణుల సహాయంతో ప్రజల అజమాయిషీ ఎక్కువ కలిగియుండునట్లుగా ప్రభుత్వ ప్రోత్సాహం తగినంత కలిగి ఉండునట్లుగా సహకార చట్టాలను సవరించి విధానాలలో మార్పులు తీసుకురావాలి. అప్పుడే దేశం మనుగడకు సహకారం ప్రగతి సాధకం కాగలదు.

## నిరంతర ధ్యానమే మార్గం!




సర్ ఐజాక్ న్యూటన్ సుప్రసిద్ధ విజ్ఞానవేత్త. తెల్లని కాంతి లక్షణ వివరణకి, గణితంలో క్యాలుక్యులస్‌కు, భూమి ఆకర్షణశక్తి సిద్ధాంతానికి ప్రపంచ ప్రఖ్యాతిని పొందాడు. 'ప్రిన్సిపియా' ఇతడు రచించిన అపూర్వ శాస్త్ర గ్రంథం. ఒకనాడు ఇట్టి మహాద్భుత విషయాలను ఎలా కనిపెట్టగలిగావు అని అడిగినప్పుడు, న్యూటన్ అతి వినయంగా మిక్కిలి నమ్రతతో, నిరంతరం వాటిని గురించి ధ్యానిస్తూండటం వల్ల అన్నాడు. నేను నా పరిశోధనా విషయాన్ని మనస్సులో పెట్టుకుని మెల్లి మెల్లిగా జ్ఞానోదయం కలిగే దాకా ధ్యానిస్తూంటాను" అని అతడి పరిశోధనా విధానాన్ని వివరించాడు.

"జ్ఞానోదయం కలిగించుకోడానికి జీవితం అనంతావకాశాలు కలిగిసుంది."

# పసిపిల్లల దంత సంరక్షణ

అనారోగ్యకరమైన దంతాలవల్ల పండ్లపోట్లు, చిగుళ్ళ వాపు, జ్వరం, హృదయానికి, కీళ్ళకు సంబంధించిన అనేక ఇతర రోగాలు సంభవిస్తాయి. ఇటువంటి సాధారణ అనారోగ్యాలు కలుగకుండా నివారించుకోడానికి చిన్నప్పటి నుంచే దంతాల విషయంలో తగిన జాగ్రత్త వహించాలి.



దంతాలను శుభ్రంగా ప్రతీరోజూ రెండు పూటలూ బ్రష్‌తో కడుక్కోవాలి. పిల్లలకు ప్రత్యేకంగా బ్రష్‌లు లభిస్తాయి. చిగుళ్ళకు తగినంత ఒత్తిడి కలిగేటట్టుగా గుండ్రంగా వర్తుల రూపంలో బ్రష్‌ను ఉపయోగిస్తూ పండ్లను శుభ్రం చేసుకోడం అభ్యాసం చేసుకోవాలి. బ్రష్‌ను ఉపయోగించే నైపుణ్యం దంతవైద్యుని అడిగి తెలుసుకోడం ఉత్తమం. ఉదయం నిద్రలేచిన వెంటనే ఒకసారి, తిరిగి రాత్రి పడుకునే ముందు మరోసారి దంతాలు శుభ్రం చేసుకోవాలి. దంతక్షయం సంభవించకుండా ఫ్లోరైడ్ అనే రసాయనిక పదార్థం చేరిన టూత్‌పేస్టును ఉపయోగించాలి.

ఆహారాన్ని నోటిలో దవడకు రెండు ప్రక్కలా బాగా మెత్తగా నమిలి తినాలి. దీని వల్ల దవడకు మంచి సాధన కలుగుతుంది. దవడ బాగా పెరుగుతుంది. తాజా కూరగాయలు, బాగా పండిన పళ్ళు, ఆకుకూరలు మొదలైనవి దంతాలకు చాలా మంచివి. వీటి వల్ల నోటిలో దంతాలు వాటంతటవే కొంతవరకూ శుభ్రపడతాయి. తినేటప్పుడు దంతాలకు అంటిపెట్టుకునే చక్కెర చేరిన చాక్లేటులు, బిస్కట్లు ఎక్కువ తినకూడదు. ఇటువంటి వాటిని తినిన వెంటనే నీరు పుక్కిలించి దంతాలను శుభ్రంగా కడుక్కోవాలి. మధ్యాహ్నంపూట భోజనంచేసే సమయంలో వీటిని తినటం ఉత్తమం.

(మిగతా 58 వ పేజీలో)

## ప్రకాశవంతమైన చేపకి దేదీప్యమానమైన అంగాలు

క్రొత్తరకం ప్రకాశవంతమైన చేపలు విద్యుద్దీపాలలా ప్రకాశిస్తూ నీటిమీద తేలిపోతున్న చిన్న పడవల్లా ఉంటాయి. ఆస్ట్రేలియా దగ్గిర సముద్రంలో సుమారు 2,100 అడుగుల లోతున ఇవి పట్టుబడ్డాయి. ఈ అపూర్వమైన చేపకు 53 దేదీప్యమానంగా ధగ ధగా ప్రకాశించే ప్రత్యేక అంగాలు ఉన్నాయి. ఈ చేపకు రెండుప్రక్కలా శరీరం అద్దాలు అమర్చినట్టు మెరుస్తుంటాయి. దీనికి 'ట్యూడర్' అని పేరుపెట్టారు.

"మన శత్రువులు మన లోపాలను తెలియజేసి మనకు మహోపకారం చేస్తారు."

# శాంతి సౌఖ్యాల రహస్యం

ప్రాచీన కాలంలో తమ సామ్రాజ్యంలో శాంతి భద్రతలకు చక్రవర్తులు మొట్ట మొదట తమ రాజ్యాలను సరిదిద్దుకునేవారు. తమ రాజ్యాలను సరిదిద్దుకోదలచి తమ కుటుంబాలను చక్కబెట్టుకునేవారు. కుటుంబాలను చక్కబెట్టుకోదలచి తమనుతాము సరిదిద్దుకోడానికి ప్రయత్నం చేసేవారు. తమనుతాము సరిదిద్దుకో దలచి తమ హృదయాలను నిష్కళంకం చేసుకునేవారు. హృదయాలను నిష్కళంకం చేసుకోదలచి నిర్వ్యాజమైన నిష్కాపట్యాన్ని పాటించదలచి విజ్ఞానాభివృద్ధి కలిగించుకునేవారు. వస్తు విచక్షణతో విజ్ఞానాభివృద్ధి కలిగించుకునేవారు.

వస్తు విచక్షణవల్ల పరిపూర్ణమైన విజ్ఞానం కలుగుతుంది. అటువంటి వారి విజ్ఞానం పరిపూర్ణమైనది కాబట్టి వారి ఆలోచనలు, ఆశయాలు నిష్కాపట్యంగా ఉండేవి. దీని ఫలితంగా హృదయాలు నిష్కళంకం అయేవి. హృదయాలు నిష్కళంకమై తమకు తాము సరిదిద్దుకునే వారు. తమకు తాము సరిదిద్దుకుంటే కుటుంబాలు కుదుటబడేవి. కుటుంబాలు కుదుటబడితే రాజ్యాలు బాగుపడేవి. రాజ్యాలు బాగుపడినప్పుడు సామ్రాజ్యం శాంతి భద్రతలతో తులతూగుతుండేది.

—కన్‌ఫ్యూషియస్




( 57 వ పేజీ తరువాయి)

దంతరోగాలు ప్రారంభదశ అంత బాధాకరంగా ఉండవు కాబట్టి మీరు అశ్రద్ధ చేయవచ్చు. వెంటనే జాగ్రత్త వహించకుండా నిర్లక్ష్యం చేయడంవల్ల దంతాలు ఊడిపోవచ్చు కూడా కాబట్టి ప్రతీ ఆరేసి నెలలకు ఒకసారి క్రమపద్ధతిలో దంతవైద్యుని సంప్రదిస్తూ వైద్యుని సలహాలను అనుసరించడం క్షేమకరం.

కొందరు పిల్లలకు దంతాలు ముందుకు వస్తాయి. ఒకదానిమీద ఒకటి బయలుదేరతాయి. మరి కొందరికి వంకర టింకర దంతాలు ఉంటాయి. ఈనాడు అతిసున్నితమైన నవీన సాధనాలతో వీటిని సరిచేయించుకోడానికి వీలుకలుగుతూంది.

దురలవాట్లు పెంచుకోవద్దు. పెన్సిళ్ళు నమలడం, బొత్తాములు నమలడం, బొటన వ్రేలు చీకటం, గోళ్ళు కొరకడం వంటి చెడ్డ అలవాట్లను వెంటనే మాన్చుకోవాలి. ఇటువంటి దురభ్యాసాలవల్ల పళ్ళు విరిగిపోతాయి, పళ్ళు వంకరగా పెరుగుతాయి.

దంతాలు ముత్యాలులాగా ఉండాలి. చిన్నప్పుడే జాగ్రత్తపడి దంతాలను సంరక్షించుకోవాలి. మంచి దంతపంక్తి ముఖసౌందర్యాన్ని ఇనుమడిస్తుంది.

"శమదమాది గుణములు ఎవరియందు
అధికముగా ఉన్నవో అతడే శ్రేష్ఠుడు."

# పోటీలు

మే 1987

విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీకాఎంట్రీ విడిగా పావురావు సైజుకు తగ్గని కాగితంమీద వ్రాయాలి. ప్రతీ ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితంమీద ఒకటి కంటే ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 15లు, రూ.10లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీకూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీలయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: మే 20, 1987. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు 'విస్డమ్', 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు 600 004.

— సంపాదకుడు.

## వ్యాసం

'యువకుల సమస్యలు పెద్దల బాధ్యతలు'' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

భారత దేశంతో ప్రప్రథమంగా వ్యాపార సంబంధాలు ప్రారంభించినవారు :

(ఎ) డచ్‌వారు, (బి) ఆంగ్లేయులు, (సి) ఫ్రెంచివారు, (డి) పోర్చుగీసువారు.

2. క్రింది రాష్ట్రములలో ఏది ఎక్కువగా భూకంపాలకు గురి అవుతుంది?

(ఎ) అస్సాం, (బి) జమ్ము మరియు కాశ్మీరు, (సి) బీహారు, (డి) మేఘాలయా.

3. ఎలక్ట్రిక్ బల్బులో వెలిగే ఫిలమెంటుకి ఉపయోగింపబడే లోహం ఏది?

## బొంబాయిలో అత్యధిక టెలిఫోన్ సాంద్రత



భారతదేశంలో టెలిఫోనులు అత్యధికంగా ఉన్న ప్రదేశం బొంబాయి. ప్రతీ 100 మందికి 4 ఫోనులు ఉన్నాయి. ఈ టెలిఫోను సాంద్రత అమెరికా రాజధాని నగరం వాషింగ్టన్ DC లో 172.7 శాతం

(ఎ) రాగి. (బి) అల్యూమినియం, (సి) ఇనుము, (డి) టంగ్‌స్టన్.

4. మీటరు గేజి రైలుదారి వెడల్పు:

(ఎ) .762 మీ., (బి) 1.67 మీ., (సి) 1.75 మీ., (డి) 1 మీ.

5. బిసిజి టీకాలమందు ఈ రోగ నిరోధానికి వాడబడుతుంది:

(ఎ) కోరింత దగ్గు, (బి) ఇన్‌ఫ్లూయెంజా, (సి) క్షయవ్యాధి, (డి) వైరస్ జ్వరం.

6. ఇది కాంతి సంవత్సరానికి ఖగోళ మానము (Astronomical measure):

(ఎ) కాంతి తీవ్రత, (బి) దూరం, (సి) కాలం, (డి) పైవి ఏవీకావు.

7. చేపకు నీటిలో శ్వాసావయవము:

(ఎ) నోరు, (బి) ఊపిరితిత్తులు, (సి) ఓపెర్‌క్యులమ్ (operculum), (డి) గిల్.

8. భారత రాజ్యాంగం పాటించే విధానం:

(ఎ) ఫెడరల్, (బి) యూనిటరీ, (సి) ఫెడరల్ రూపంలో యూనిటరీ తత్త్వం, (డి) పార్లమెంటరీ.

## పజిల్




ఆధారాలు - అడ్డం: 1. లక్ష్మీ ప్ర[illegible]మగు గాక, 3. తన్నుతాను మోసపుచ్చుకొనుట. 6. విశ్వసించునది, అనురాగము, మూడురెట్లు అను అర్థముల నిచ్చు మూడు వరుస మాటలలో మొదటి మాటలో చివరి అక్షరం ముందు పడింది, 9. ఉషస్సు, సరసత, కృత అను మూడు మాటలు కలసిపోయినవి, 14. శ్రమలు చిక్కులు, 15. సమానత్వమును సూచించును.

నిలువు: 1. ఆంధ్రదేశంలో సుప్రసిద్ధ శైవ పుణ్యస్థలం, 2. భగవద్గీత కాదు పొగడికతో కూడిన గీత, 3. మనో దృష్టితో చూచుట, 4. పాకముచేసి సిద్ధపరచిన ఆహార పదార్థం, 5. ప్రవర్తన, 7. ఇది అతి చంచలము. 8. లక్ష్మణుని తల్లి 9. కృత్రిమము కానిది, 10. అందరికి మామ, 11. వినాయకునికి ప్రియమైనవి, 12. సమానమైన అనురాగము గల, 13. రుచుల నెరుగుట.

## 1869 వ సం.లో పోస్టుకార్డు మొట్టమొదట రూపొందించబడింది

ఆస్ట్రేలియాలో తపాలా బిళ్ళలను సేకరించే ఇ. హెర్మన్ 1869 వ సం.లో పోస్టుకార్డును అభివృద్ధి చేసాడు. భారత దేశంలో మొట్టమొదటి పోస్టుకార్డును 1879వ సం.లో మెస్సర్స్ డి లారూ అండ్ కో, లండన్‌వారు అచ్చువేశారు.

“మనలను పొగిడేవారే మనకు నిజమైన అపకారులు.”

## తెలివికి పరీక్ష

1. సంస్కారాలు ఎప్పుడు అనుభవాలు అవుతాయి?

2. ధీరుడికి నిండుకుండకి గల సంబంధ మేమిటి?

3. ఈ క్రింది పదములకు సాధారణంగా తెలుగులో వాడే ద్వంద్వపదాలను వ్రాయండి.

(ఎ) సౌందర్యం, (బి) సహాయం, (సి) అసత్యమైన, (డి) అతిత్వరితంగా.

4. ఈ క్రింది వరుసలో ఇముడనిది ఏది?

సూర్యుడు, భూమి, కుజుడు, శుక్రుడు, గురుడు.

5. ఈ క్రింది బ్రాకెట్లలోని ఖాళీని సరైన సంఖ్యతో పూరించు.

112 (190) 17, 268 ( ) 107.

6. ఈ వరుసలో వచ్చే తరువాతి సంఖ్య ఏది?

82, 99, 122 —

7. ఈ క్రింది వాక్యములలో "కొట్టు" అనే పదము తెలుగు భాషలో ఎలా వాడబడుతుంది?

(ఎ) మురుగు కాలవ వాసన వేస్తూంది, (బి) శుభలేఖ ముద్రించాడు, (సి) ఇంటికి వెళ్లవేసారు, (డి) నాకు రామాయణం మిక్కిలి పరిచితమైనది.

8. ఈ క్రిందివాటిలో ఇముడనిది ఏది?

శబ్దము, స్పర్శము, రూపము, సత్త్వము, రసము, గంధము.

### మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని అర్థాలను గుర్తించండి:

1. చొక్కు: యత్నించు (ఎ) మరణించు (బి), వలపు (సి), మూర్ఛ (డి).

2. తడవు: జాగు (ఎ), అవకాశము (బి), తాకు (సి), పోషించు (డి).

3. తీరుగడ: చెరకు సస్యవిశేషము (ఎ), అవసానము (బి), ముగింపు (సి), కప్పము (డి).

## ఏ స డ మ్
### పో టీ ల కూ ప న
### మే 1987

## ఈగకన్ను ఆధారంగా ఏర్పరచిన పారిశ్రామిక రాబోటు కళ్లు



సోవియెట్ యూనియన్‌లో భౌతిక విజ్ఞాన వేత్తలు రాబోటుల కంటి (eyes) నిర్మాణానికి మామూలు ఈగ కంటి మీద ఆధార పడ్డారు. కాంతికి సరిసమంగా చైతన్యత కలిగిన కణాలు వేలకొద్దీ వీటి కళ్ళలో ఉంటాయి. ఈగదృష్టి అతి నైపుణ్యంగా సర్వతోముఖంగా ఉంటుంది. విజ్ఞాన శాస్త్రజ్ఞులు అతి చాతుర్యంగా వీటిని అనుకరించి రాబోటులలో ప్రత్యేకంగా కళ్ళ (eye) ను ఏర్పరచారు.

"ఆత్మ పరిశోధన, పరివర్తనకు ప్రథమ సోపానం." —థామస్ మాన్

# విసదమ్

## పోటీల కూపను

## మే 1987

4. తనరు: అరితేరు (ఎ), అతిశయించు (బి), ప్రకాశించు (సి), వసించు (డి).

5. చిదుము: త్రుంచు (ఎ), గిల్లు (బి), వధించు (సి), సేకరించు (డి).

6. విదురుడు: పండితుడు (ఎ), కుత్రలు పన్నువాడు (బి), పాండురాజు తమ్ముడు (సి), కౌరవులకు మంత్రి (డి).

7. వాయి: నోరు (ఎ), ముఖము (బి), అగ్రము (సి), కాకి (డి).

8, వెక్కసము: సహింపరాని స్థితి (ఎ), లోకువ (బి), ఆశ్చర్యము (సి), అధికము (డి).

### ముఖచిత్రవ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

### పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా 15 మాటలకు మించకుండా చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకం బహుమతి!

### మీరైతే...?

"లలితకళలు సౌభ్రాతృత్వానికి పునాదులు" అంటే మీరు ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

### భావపరిచయపోటీ




8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న చిత్రాలను పరిశీలించి చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

## 6,000 సం. పూర్వం కాల్చిన రొట్టె కనుగొనబడింది

స్విట్జర్లాండులో పురావస్తు శిల్పశాస్త్రజ్ఞులు 6,000 సం.కు పూర్వం కాల్చబడిన రొట్టెను కనుగొన్నారు. ఇన్నేళ్ళపాటు భూగర్భంలో ఉన్న ఈ రొట్టె శిలగా మారిపోయింది.

('మిషా' సౌజన్యంతో)

"పథ్యౌషధ సేవల సేవించుట చేత రోగికి ఆరోగ్య సిద్ధి కలుగుతుంది.
ఇతరులచే చేయబడిన పథ్యౌషధ సేవలచే రోగికి ఆరోగ్య సిద్ధి కలుగదు."

# పోటీలు - ఫలితాలు

(మార్చి 1987)

వ్యాసం - విజేతలు: మొదటి బహుమతి తిరుమల విజయకుమార్, కరీంనగర్; రెండవ బహుమతి: జె. స్వామినాయుడు, విశాఖపట్టణం; మూడవ బహుమతి: గుంటి పుండరీకాక్షయ్య, శ్రీకాకుళం.

క్విజ్ - జవాబులు: 1. (బి) వాలెంటినా తెరెష్కోవా, 2. (బి) బీహార్, 3. (ఎ) తమిళనాడు, 4. (బి) రేచీకటి, 5. (ఎ) రైల్వేలు, 6. (సి) వ్యవసాయము మరియు గ్రామీణాభివృద్ధి, 7. (డి) భారతదేశంలో మూడవ విమాన సంస్థ, 8. (బి) నీరు.

**విజేతలు**: మొదటి బహుమతి: ఎస్.వి. నాగభూషణం, కడప; రెండవ బహుమతి: పట్టా సుధారాణి, విశాఖపట్టణం; మూడవ బహుమతి: టి. మురారి, దోని, (కర్నూలు జిల్లా)

పజిల్ - జవాబులు - అడ్డం: 1. నవభారత నిర్మాతలు, 5. అనిసతిరా, 8. వినతి, 9. యయాతి, 10. బుద్ధిబలము, 11. ఎగుడు, 12. భారవి, 14. తఅసనర, 17. దిగుమతి, 18. సవరము.

నిలువు: 1. నట్టడవి, 2. రజని, 3. నిరతి, 4. ఒక్కుర్యతి, 5. అతిబుడుత, 6. సబుబ, 7. రాయముభార, 11. ఎనుబది, 13. వివేకము, 15. ఆరతి, 16. సరస.

**విజేతలు**: మొదటి బహుమతి: ఎ. రాజరాజేశ్వరి, విశాఖపట్టణం; రెండవ బహుమతి: జి.డి. సన్యాసమ్మ, కళింగపట్టణం; మూడవ బహుమతి: డా. వి.వి. వెంకటేశ్వరరావు, అడవులదీవి, (గుంటూరు జిల్లా)

**తెలివికి పరీక్ష-జవాబులు**: 1. కన్ను లేకపోతే, 2. ఎందరో మహానుభావులు అందరికీ వందనములు, 3. వికారం పోయి ఆకారం వస్తే, 4. (సి) రామగుండం, 5.

## ఒక్క రోజులో అధికంగా పరుగులు చేసిన బ్రాడ్‌మన్



డాన్ బ్రాడ్‌మన్

ఆస్ట్రేలియా దేశస్థుడు డి.జి. బ్రాడ్‌మన్ 1930వ సం.లో లీడ్సులో ఇంగ్లండుకు పోటీగా ఆడిన ఆటలో ఒక్క రోజులో అధికంగా పరుగులు చేసాడు. మధ్యాహ్నం లంచ్ సమయానికి 105, టీ సమయానికి 220, ఆట ముగింపు సమయానికి 309 పరుగులు పూర్తి చేసాడు.

"మడుగులో జొచ్చినవానికి అన్ని దిశలు జలమయములై తోచునట్లు, భగవంతుని భక్త్యానందంలో మునిగిన భక్తునకు ఎటు చూచినా సుఖమయమే."

చీకట్లో ఉన్నప్పుడు, 6. (ఎ) రవీంద్రనాథ్ ఠాగూర్, (బి) బంకిమ్‌చంద్ర చటర్జీ, (సి) మహమ్మద్ ఇక్బాల్. (డి) సరోజినీ... నర్మిమెహతా, 7. ఒలాఫ్‌పామే (అన్యాయాలకు వ్యతిరేకంగాను, అభివృద్ధి చెందుతూన్న దేశాల ఆశయాల కొరకు చేసిన కృషికి.), 8. (ఎ) తాతకు దగ్గులు నేర్పుట, (బి) నక్కను త్రొక్కుట, (సి) చూపులగుర్రం, (డి) కడుపువిండిన బేరం.

విజేతలు: ఎవ్వరూ లేరు.

**మాటల మహిమ - జవాబులు:** 1. అపేక్ష (ఎ), ఆవశ్యకత (బి), శ్రద్ధ (సి); 2. పొందిక (ఎ), సామ్యము (బి); 3. కొరత (సి), శేషము (డి); 4. గుప్పుని కొట్టు వాసన (ఎ), భయము (సి); 5. ఉతికిన వస్త్రము(ఎ), శైత్యము (బి); 6. పస్తు (ఎ), ఉపవాసము (బి); 7. స్నేహము (ఎ), ఉమ్మడి (బి), అవిభక్తత (సి); 8. శ్రమపడు (ఎ), నొచ్చు (బి), విసుగు (సి), విచారము పొందు (డి).

**విజేతలు:** - మొదటి బహుమతి: ఎల్. సత్యనారాయణ, వెంకంపేట, (విజయనగరం జిల్లా); రెండవ బహుమతి: ఎన్. సుధామాదవి. హైద్రాబాద్; మూడవ బహుమతి: వి. జగదీశ్, వరంగల్.

ముఖచిత్రవ్యాఖ్య: - మొదటి బహుమతి: ఎన్.ఎస్. ప్రకాష్, కొడిమియాల్, (కరీంనగర్ జిల్లా); రెండవ బహుమతి: భమిడిపాటి అప్పల నరసింహాంజీ, నరసన్నపేట, (శ్రీకాకుళం జిల్లా); మూడవ బహుమతి: సి. హెచ్. ధనంజయ, బినోలా, (నిజామాబాద్ జిల్లా).

పాఠకుల అభిప్రాయాలు: - మొదటి బహుమతి: కోరాడ దుర్గారావు, చీపురుపల్లి (విజయనగరం జిల్లా); రెండవ బహుమతి: వి. సుబ్రహ్మణ్యం రాజు, ఏలూరు, (ప.గో జిల్లా).

మీరైతే ? - మొదటి బహుమతి: పి. సత్యప్రభ, విశాఖపట్టణం; రెండవ బహుమతి: ఎన్.ఎస్. ప్రకాష్, కొడిమియాల్, (కరీంనగర్ జిల్లా).

భావపరిచయ పోటీ - మొదటి బహుమతి: కుమారి కుప్పచ్చి లావణ్య లక్ష్మి, జిల్లెళ్ళమూడి, (గుంటూరు జిల్లా); రెండవ బహుమతి: టి. మురారి, దోని, (కర్నూలు జిల్లా).

## పౌష్టికాహారం లోపంవల్ల రోజుకి 40,000 మంది పిల్లలు మరణిస్తున్నారు



ప్రతిరోజూ 40,000 మందికి పైబడిన చిన్నపిల్లలు ముఖ్యంగా పౌష్టికాహార లోపం వల్ల మరణిస్తున్నారు. ప్రతి శిశు మరణానికి 6 మంది ఆకలితోను, అనారోగ్యంతోను బాధపడుతున్నారు.

('యునిసెఫ్' సౌజన్యంతో)

"నొప్పించక తానొవ్వక తప్పించుకు తిరిగేదే ధన్య గుణం."